# కథ

[ఇది సాంఘికనాటకము. ఒకఊళ్లో కళ్యాణినాయుడని యొక చదువుకొన్న, ధనవంతుడైన రసజ్ఞుడైన పెద్దమనిషి ఉన్నాడు. ఆయనయింటికి కవులూ, నటులూ వస్తూపోతూ ఉంటారు. ఆయన వారిని ఆదరిస్తూ ఉంటాడు. ఆ ఊళ్లో భగీరథ శాస్త్రిగారని ఒక పండితు డున్నాడు. ఆయనకూతురుపేరు వసుంధర. ఆవిడ విధవరాలు. ఆమెకు బి. ఏ. చదివే కొడు కొక డున్నాడు. అతనిపేరు కళింగరావు. ఈ కళింగరావు చదువుకు పదేళ్ళనుంచీ కల్యాణినాయుడు డబ్బిస్తున్నాడు.

నాయుడికి వసుధమీద ప్రేమ కలదు. వసుధకును నాయుడిమీద ప్రేమ ఉన్నది. కాని ఆమె కది అధర్మమని తెలుసు. అది ప్రేమా కాదు, తన కొడుకుచదువుకి డబ్బిచ్చాడన్న అభిమానం, అతడు మహాపురుషుడన్న గౌరవం.

నాయుడుభార్యకు నాయుడిమీద ప్రేమలేదు. ఆవిడపేరు చంద్రమతి. మెస్మరిజమువల్ల ప్రేమ కలిగించవచ్చునని యెవరో చెబితే నాయుడు విని, యొక మెస్మరిస్టుని తీసుకువచ్చి ఆయన చేత వైద్యం చేయిస్తూవుంటాడు. ఆ మెస్మరిస్టుపేరు ప్రొఫెసరు సంగం. ఇందులో కవిపేరు రాధాకృష్ణ. నటకుడు రెనడే. అసలు పేరు రామనాథం. వీ రిరువురికి కథతో ఏమీ సంబంధంలేదు. నాయుడుగారి ఔదార్యం తెలియజేయడానికిమాత్రమే వా రీ కథలో గ్రహించబడ్డారు.

కళింగరావు తండ్రితద్దినం పెట్టనంటాడు. దానితో కథలోకి ఒక మార్పు వచ్చింది: మెస్మరిజంవల్ల చంద్రమతి భర్తని ప్రేమిస్తుంది. కొడుకు లేచిపోతాడు. అందుచేత వసుధ తానాత్మహత్య చేసుకొంటుంది. భగీరథశాస్త్రిలు సన్యసిస్తాడు. నాయుడు వసుధమృతికి దుఃఖిస్తాడు. కాని భార్యా, తానూ తరువాత సుఖంగా బ్రతుకుతారు.

ఇది లోకములో జరుగుతున్న కథ. కాదు గాని సంఘము యొక్క ఒక వ్యవస్థను నిర్ణయించడానికి ఇందులో ప్రయత్నమున్నది. అందుచేత యిందులో కొన్ని పాత్రలు లోకానుగుణముగా ఉండవు. ఆదర్శప్రాయంగా ఉంటవి. సాంఘిక నాటకమంటే సంఘమును యథామాతృకంగా చిత్రించడంకన్న సంఘంలో ఉన్న దోషాలు చూపించడానికీ, దోషయుతమైన సంఘమునందు గుణాధానంచెయ్యడానికీ, ప్రయత్నించడానికీ అయితే బాగుంటుందని ఊహపడి యిల్లా వ్రాయటం. వీనియందున్న పాత్రలను ఎవరినీ ఉద్దేశించి వ్రాయలేదు.]

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు:

పురుషులు :—

| | |
|---|---|
| కళ్యాణి | (కథానాయకుడు) |
| ప్రొఫెసరు సంగం | (మెస్మరిస్టు) |
| రాధాకృష్ణ | (కవి) |
| రామనాథం | (రెనడె—నటకుడు) |
| భగీరథశాస్త్రి | (వసుంధర తండ్రి) |
| బుచ్చిమామ | (వసుధ మేనమామ) |
| కళింగరావు | (వసుధ కొడుకు) |

స్త్రీలు :—

| | |
|---|---|
| చంద్రమతి | (నాయుడు భార్య, కథానాయిక) |
| రాజ్యం | (కళింగరావు క్లాస్ మేట్) |
| వసుధ | (కళింగరావు తల్లి) |

# తల్లిలేని పిల్ల

## ప్రథమాంకము



ప్రదేశం—కళ్యాణి యిల్లు

ప్రవేశం—రాధ కృష్ణ

గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ వాణి లక్ష్మిఁ
పార్వతిని వాక్కునందున వక్షమందు
సగము దేహంబునందుఁ దాల్బంగఁజేయు
నే ప్రణయశక్తి యామె జయించుగాక.

గీ. సృష్టికైనను తాఁ బ్రతిసృష్టిచేసె
ఘోర తపములు దిక్కులఁ గొలిచిపోసె
అంతవాడు విశ్వామిత్రు డతనినే జ
యించె ప్రణయమ్మ నదియు జయించకున్నె.

గీ. వెలి కొకడు చెప్పు నొకడు లోపలనె దాచు
పైకనినవాడు దుష్టు డీ పగిది జగము
వసుధ సర్వమ్ము నాడించు ప్రణయమన్న
మహిత శక్తికి నేను నమస్కరింతు.

కళ్యాణి: [ప్రవేశించి] ఏవో క్రొత్తపద్యాలు వ్రాసినట్లున్నారే?

రాధా : నిన్న మీకు వినిపించినవే.

క : అయితే అందులో వసుధ అన్నారేమిటి?

రా : వసుధ అంటే భూమి.

క : వాళ్ళ యింటికి పోదామా?

రా : ఎవరింటికి?

క : వసుధ యింటికి.

రా : వసుధ ఎవరు?

క : ఎప్పుడూ క్రొత్తేనా?

రా : ఆవిడపేరు వసుధా యేమిటి?

క : తెలియకండానే పద్యంలో వ్రాశారా యేమిటి?

రా : ఇది బాగుంది.

చంద్రమతి: (వచ్చి) ఏది బాగుంది?

క : (ఆశ్చర్యంతో చూస్తాడు.)

రా : ఏమి టట్లా చూస్తారు?

చం : ఏమి టట్లా చూస్తారంటావేమిటి? అవిచూపులా! మన్మధుని బాణాలు. సన్నజాజిపూలు. ఆహా! ఏమి సొగసైనచూపులు! ఎంత తెల్లగానున్నవి. అప్పుడే పామువిడిచిన కూసము వలె, వానవదలిన తెల్లనిమొగిలువలె నా హృదయము నాకర్షించుచున్నవి.

క. అవి నా యెదలో చొరపడి
నవి రంగులసుళ్ళు తిరిగినవి కాలువలై
నవి నవనవలాడుచు మా
ర్దవరేఖలకొాజలై సరాగమ్ములునై

రా : ఇదేమిటి? నాటకంలోకివస్తే, ఈ సిగ్గుచూపు లేమిటి? ఈ అభినయమేమిటి?

క : ఏమిటేమిటి రండి! చంద్రం! ఇంట్లోకి పోదాం రా.

చం : నేను రాను యింట్లోకి. ఇక్కడనే ప్రేమించుకొందాం. ఇక్కడనే జలక్రీడలాడదాం. ఇక్కడనే పూలడోలికల్లో విహరిద్దాం. ఇక్కడనే—

రా : ఇక్కడనే?

[కళ్యాణి బలవంతంగా చంద్రమతిని లాక్కుపోవును]

రా : పిచ్చిది కాబోలు! మనిషి ఏమి అందంగా వుంది. పుస్తకాలల్లో వ్రాసినట్లుందే యీవిడ అందం.

క : (వచ్చి) క్షమించాలి. మా వాళ్ళకు కొంచెంజబ్బుగా వుంది. పైత్యించింది.

సంగం: (వచ్చి) మీరు కొంతసేపు కనపడకుండా పోవాలి.

క : రాధాకృష్ణగారూ! మనం వసుధయింటికి పోదాం. ప్రొఫెసరుగారూ! మీరు జాగ్రత్తగా చూడాలి. మమ్మల్ని ఎంత సేపటికి రమ్మంటారు.

ప్రొఫె: (సంగం) ఇప్పుడు రెండున్నర అయింది. అయిదింటికి రండి.

క : సరే (కళ్యాణి, రాధ నిష్క్రమింతురు)

ప్రొ : ఏమమ్మా ఎలాగుంది?

చం : (వికవికనవ్వి) మన మిద్దరమూ రతీమన్మథులవలె, సత్య

భామా కృష్ణులవలె, రంభా నలకూబరులవలె, తారా చం
ద్రులవలె (నవ్వును)

ప్రొ : నా కేమీ తెలియటంలేదు.

చంద్ర: ప్రియుడా! నామీద నీకేల దయరాదు?

ఉ. నా వగకాడ! నాదు రత
నమ్ముల మేడ మనోజభోగగా
ధావలిప్రోడ నావగు ప్ర
తమ్ములు కట్టిన చెట్టునీడ, నా
మోవి పటుక్కునంగొరికి
ముద్దుల ప్రోవులు పెట్టరాదె లే
దావల పారంద్రోసికొని
నట్టుల నవ్వగరాదె మత్పతీ.

క : (ప్రవేశించి) ప్రొఫెసరుగారూ!

ప్రొఫె: అనుమానపడుతున్నారా యేమిటి? నేను ఆవిడమీదికి ఇంకోరి ఆత్మ వచ్చేటట్లు మెస్మరైజు చేశాను. క్రొత్తలో అందరిమీదా అట్లాగే ప్రేమ వున్నట్లు మాట్లాడుతుంది. క్రమంగా అది మీమీద మాత్రమే మిగిలేటట్లు చేస్తాను.

చంద్ర: ప్రియుడా! వచ్చితివా! నిన్ను వదలి నేను నిముసమైనను బ్రతుకంజాలనే! రాజా! నామీద నీ కెందు కింత వైరము. ఈ చంద్రుడు నాపై నిప్పులు చెఱగుచున్నాడు. ఓరీ! చంద్రుడా!

8. [illegible]
[illegible] ప్రకృతి [illegible]
[illegible]
[illegible] యల్లనకు [illegible] శిక్షల్లములన్.

క : ఎవరిఆత్మ నీమెమీద ప్రవేశపెట్టారు?

ప్రొఫె: నా కదే తెలియటంలేదు. మంచిబలమైన ప్రేమగలఆత్మని ఉద్దేశించి చేశాను.

క : ఈ పద్యాలు పాడటం ఏమిటి? పుస్తకాలల్లో వున్నట్లుమాట్లాడటమేమిటి?

ప్రొఫె: అయ్యా! మీరు నా కోపని అప్పచేప్పారు. ఆ పని పూర్తి అయ్యేదాకా వుండాలిగాని మధ్య అనుమానాలుపడి తికమక ప్రశ్నలు వేసి యిల్లాచేస్తే నాచేతకాదండీ.

క : క్షమించండి. అంత కోపమెందుకు? నాకు అదుర్దాగావుంది. అందుకని అడిగాను.

ప్రొఫె: మీకు ఒక్క ఆదుర్దామాత్రమే. నాకో, లక్షభారముంది నా నెత్తిన.

క : అయితే వెళ్ళమంటారా! వెళుతున్నాను.

[నిష్క్రమించును]

చంద్ర: మీరు నా కా కీర్తన నేర్పమంటే నేర్పలేదు. తరువాత నన్నేమన్నా అంటే లాభంలేదు.

ప్రొఫె: ఏ కీర్తన?

చంద్ర: ఈ కీర్తనండీ-మరల విను సఖీ! మరల విను సఖీ! లలి

తాలాప మదిగో! కాదని వాదించెదవా?—ఈ కీర్తన
ప్రొ ఫె: ఈమె గొంతు ఎంత మధురంగా వుటుంది?
చంద్ర: (ఒకచోట కూర్చుండి)

ఎలమావిపైఁ గన్ను లెట్టిచేసెదవేలె?
కోకిలా నీయిల్లు కూలిపోను.

ప్రొ ఫె: ఆ పద్యం ఎక్కడిది?
చంద్ర: మీరు చదవమన్నదే.
సంగ: అయ్యవార్లంగారిని చేయబోతే కోతి అయ్యిందట.
చంద్ర: చెలీ! నా భర్తను కోతియని వెక్కిరించెదవా? లోకములో నల్లనివా రుండరా? అందులో నా భర్త దేహచ్ఛాయ పట్టి నలుపా? నీలమేఘచ్ఛాయయనికదా నారదాదులు వర్ణింతురు.
సం : ఇది యేదో నాటకమల్లే వుంది.
చంద్ర: ఇంకా పదిరోజులుందికాదూ!
సం : ఏమిటి పదిరోజులుంది?
చంద్ర: తెలియనట్లడుగుతున్నారే!
సం : కాదు. నిజంగా తెలియకనే.
చంద్ర: ఇక చాలులెండి.

ఎలమావిపై కన్ను లెట్టిచేసెదవేలె?
కోకిలా నీ యిల్లు కూలిపోను.

సం : కోకిలయిల్లుమాట యెటావున్నా నా యింటి మీదికి వచ్చింది.

రెనడే: (ప్రవేశించి) ఏ యింటికి మాత్రం ఏమి? నాయుడింటి మీదికి వచ్చాను.

సం : మీ పేరు?

రెనడే: ఎన్నడువచ్చినవారు మీ కేమి తెలుస్తుంది. నాపేరు మాస్టరు-రెనడే అంటారు. నేను పెద్ద యాక్టరుని. పెద్దపెద్దచోట్ల నన్ను మెచ్చుకొన్నారులెండి. బర్మాలో నాకు బంగారు గదకూడా యిచ్చారు.

సం : సుమత్రాలో ఏమీ యివ్వలా?

రెనడే: సుమత్రా అంటే?

సం : సుమత్రా, జావా, బోర్నియో అని బర్మాకి దగ్గరే?

రెనడే: మే మక్కడకు వెళ్ళలేదు.

సం : మీ రేమి వేషాలు వేస్తారు?

రెనడే: అసలు పెద్దవేషాలే మనవి. రాధాకృష్ణలో కృష్ణుడు వేస్తాను. అందులో మరీ ఒక పద్యం వుంది. అది నేను పాడితే వన్సుమోరులు, చప్పట్లు పదినిమిషాలదాకాఆగవు.

సం : ఏదీ! చదవండీ.

రెనడే. ఇప్పుడు చదవమంటారా? కొంచెంసు_స్తీగా వుందే వొంట్లో

సం : ఇప్పు డెట్లా వస్తే అట్లాగే చదవండి.

రెనడే: [గొంతు సవరించుకొని]

అవిసెమొక్కను నేను 'రాధాక్షీ' దాని
పైకిఁ బ్రాకిన తామలపాకు తీగ
నేను నల్లని మేఘమ నీ లతాంగి
తఱుముకొని నన్ను వెలిగించు మెఱుపుతీగ.

చంద్ర: నా కృష్ణు డెందున్నాడని వెదుకుదును.

ఉ. నల్లనివాడు పద్మనయ
నంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళిపరి
సర్పితపింఛమువాడు నవ్వురా
జిల్లెడు మోమువా డొకడు
చెల్వలమానధనంబు తెచ్చె నో
మల్లియలార! మీ పొదల
మాటున లేడుగదమ్మ చెప్పరే.

రెనడే: ఆహా! ఈ సమీపమున నేదియో మధుర ధ్వని వినిపించు చున్నది. ఆమె నా ప్రియురాలై యుండనోపు. రాధా!రాధా! నీవు నాకై యెన్నియిడుమలఁ గుడుచుచుంటివోకదా!

చంద్ర: ఓ పాటలీవృక్షమా! మన్మథుని కన్నవాడు, ఉపనిషత్తులు తనపాదములను సేవించువాడు, పెదవిపైఁ జిరునవ్వు తాండవించువాడు, మౌనిజనుల హృదయమే యిల్లుగా గలవాడు, శేషశాయి, భక్తజనమందారుడు. రాధికాప్రాణలోలుడు. నీకు గనిపించినచోఁ జెప్పి పున్నెము కట్టుకొమ్మ!

రెనడే: అదిగో! ఆమె రాధయే. వియోగ కృశీభూతశరీరయై తల విరియఁబోసికొని నాకై యెంత వెదకుచు వచ్చుచున్నది. ఓరీ! కృష్ణుడా! నీ వెంత నిర్దయుడవు. నీకై యింత విరహావస్థ పడుచున్న యీ రాధయెడల నీకు విరోధము

తగదు. తగదు. నీవుపోయి యింకనైన నామె నోదార్చుము.

సం : రెనడేగారూ! ఇది కళ్యాణిగారియిల్లు. ఆవిడ నాయుడు గారిభార్య. తమరు రెనడేగారు.

రెనడే: క్షమించండి నేను మరచిపోయినాను. నా పోర్షనువెంటనే వచ్చేపోర్షను ఆవిడ చదివేటప్పటికి అలవాటుచొప్పున నాకూ అదే వచ్చింది.

సం : నాకు పనివుంది. తమ రింక వెళతారా?

చంద్ర: చెలీ! నా నాథుని నీ వెచ్చటికి గొనిపోదువు. ఆ పాడు రుక్మిణీయింటికా! ఆ పాడు సత్యభామ యింటికా!

రెనడే: రాధా! నీ కా భయము వలదు. నేను నీ యింటనే యుండెదను. రుక్మిణికాని, సత్యభామగాని నాకు నీయంత ప్రియులు గారు.

సం : ఇది నాయుడుగారి యిల్లు.

రెనడే: క్షమించాలి. వెళుతున్నా.

చంద్ర: ప్రియుడా! నన్ను వదలిపోయెదవా! నీవే నా ప్రాణమని నీవే నా దైవమని నమ్మియుంటిని గదా! పోయెదవా! అయ్యో! అయ్యో!

రెనడే: రాధా! ఏమిచేయుదును. సత్యభామచెలికత్తె నన్ను లాగుకొనిపోవుచున్నది.

(నిష్క్రమించును)

సం : కథ మంచిపాకంలో పడ్డది.

[చేతితో చంద్రంను మెస్మరైజు చేయుచుండగా తెరపడును]

# తల్లిలేనిపిల్ల

## ద్వితీయాంకము

[వసుధయిల్లు—ప్రవేశము: వసుధ, కళ్యాణి, రాధాకృష్ణ]

వసు : ఇవ్వేళ మీ దర్శనం కావటం చాలా సుదినం.

రాధ : నేనూ తమరిదర్శనం ఎపుడు చేద్దామా అని యిన్నాళ్లు అనుకొంటున్నాను. నా అదృష్టం వల్లనే సమకూడింది.

వసు : తమరు అంతగా అనవలసినవాళ్ళం కాదులెండి.

రాధా: నాయుడుగారు తమవిషయం చాలా చెప్పారు. మీరు అల్లాగే అంటారు లెండి.

వసు : ఏం చెప్పారండీ! నాయుడుగారూ!

క : ఆయన్నే అడగండి.

రా : మీరు చక్కగా పాడుతారని చెప్పారు. మీది మంచి పక్వమైన హృదయం అని చెప్పారు.

వసు : ఇష్టమైతే సరి యెన్నన్నా చెప్పవచ్చు.

క : అవును మీరంటే నా కిష్టం కనకనేగా!

వసు : కనకనేగా ఏమిటి?

క : బాగా వుంది. నే నేమన్నాను. ఏమీలేదు.

రాధా : తమరేమన్నా పాడుతారా? విందామని వుంది.

వసు : రెండు మూడు రోజులనుంచి సరిగా లేదండి.

క : సరిగానే వుందే. వానలూ లేవు ఏమీ లేవు. బాగానే వుందే.

వ : ఇదంతే నాయుడుగారి వరస.

క : వరసా గీసా లేనివాళ్ళకన్నా నయం కాదూ!

రాధా: మీ రెందుకు? మీరేదన్నా పాడండి.

క : ఏదన్నా పాడే!

రాధా : మీరు మరీ చిన్నవాళ్ళయిపోతున్నారే.

వసు : ఇంటిదగ్గర యీ చమత్కారం ఏమీ లేదండోయి మళ్ళీను.

రా : అక్కడ యింతకన్న యెక్కువ చమత్కారంగానే వుంది లెండి.

వసు : ఏం! భార్యాభర్తలు కలిసి కాపురం చేస్తున్నారా యేమిటి?

క : అందాకా వుంటే. యిందాకా యెందుకు?

వసు : ఆ సంగతి నాకు తెలుసు.

క : తెలిసి ఏమి లాభం? తెలియక యేమిలాభం!

వ : ఏం పాడమంటారు?

రా : ఏదయినా కృతిపాడండి.

వసు : 'రామ! నీదు చరణములే

గతియని నిరతము నమ్మినవాడరా!
'వేదవేదాంత విదితుడని'

క : ఇదికాదు. ఇంకొకటి పాడాలి.

రా : ఏమిటిది?

క : ఆవిడికి తెలుసు.

వసు : శివదీక్షాపరురాలనురా?

రా : ఏదీ, అది పాడండి.

వ : గొంతు బాగా లేదండి.
క : ఎవరన్నా పాడమంటే సరి, అదేరోగం.
వసు : తిట్టట మెందుకు, పాడతాగా. (పాడును)
రా : సన్నంలో మీగొంతుక చాలా బాగుందండీ.
క : మనిషి సన్నంకాదండీ! అందుచేత గొంతుక సన్నం.
వసు : మా నాన్న వచ్చే వేళయింది.
క : అంటే మమ్మల్ని వెళ్ళమనా?
(తెరలో) అమ్మాయీ—
వసు : (జడ పూడతీసుకుంటూ) అదుగో! ఆయన రానే వచ్చాడు.
రా : జడ పూడతీస్తారేం?
క : (పువ్వులేరుతూ) పువ్వులు నే నేరుకొనేందుకు.
భ : (ప్రవేశించి) ఓహో! నాయుడుగారా! వీరెవరండీ?
క : వీరు రాధాకృష్ణ అని, చాలా గొప్ప కవీశ్వరులండీ. బ్రతికున్నవాళ్ళల్లో యింతకవి లేడండీ.
భ : ఇప్పటి కవులకీ చదువూరాదూ, సంధ్యారాదు.
రాధ : సంధ్యరానిమాట నిజమేనండీ.
భ : అమ్మాయీ!
క : మీరేదో మాట్లాడాలల్లేవుంది. సెలవా?
భ : తమ రుండవచ్చునండీ.
క : మళ్ళీ వస్తానులెండి.
వ : నాయుడుగారూ! మీతో మాటండి.
భ : అయితే నేను వెళ్ళి మళ్ళీ వస్తాను. (నిష్క్రమి)
[రాధాకృష్ణ దూరముగాఁ బోవును]

వ : మీతో మాట్లాడటమంటే సిగ్గుగా వుంటోంది.

క : అంతమట్టుకేగా! అసలు చెప్పండి.

వ : మా అబ్బాయిదగ్గరనుంచి మళ్ళీ వుత్తరం వచ్చింది. వాడి కీ నెల యేమీ పంపించలేదు. వెంటనే ఒక వంద రూపాయీలు పంపించమని వ్రాశాడు.

క : మా యింట్లో వైద్యం చేయిస్తున్నాను. అక్కడ ఎంతన్నా ఖర్చు అవుతోంది.

వ : జబ్బు ఏమీలేకుండా వైద్యం ఎందుకు?

క : మీకెన్నిసార్లు చెప్పను. నేను మీచుట్టూ తిరగటమేతప్ప మీకు నా మీద దయరాలేదాయెను. ఇంట్లోనైనా సుఖం లేదాయెను. ఏం చెయ్యను?

వ : ప్రేమ దానంతట అది పుట్టాలి. వైద్యంచేయిస్తే పుడుతుందా!

క : దానంతట అది పుట్టుతోంది కనుక వైద్యం చేయిస్తే పుట్ట దని దిగులా!

వ : మీరు మాటిమాటికి దెప్పుతారుగాని నా విషయం విచారించరు.

క : అవునండీ! మన మిద్దరమూ పెండ్లిచేసుకుంటే మీ నాన్న గారు చస్తారు. మీ కొమారుడికి అప్రతిష్ఠ. నేను చచ్చిపోతానని మీకేమన్నా దిగులుందా! పెండ్లి చేసుకోకపోతే మానె?

వ : మీ రట్లా అనరాదు. పెండ్లిచేసుకొంటే చేసుకోవాలిగాని అటువంటి పాపపు బ్రతుకు బ్రతకటానికి నా కిష్టములేదు.

క : మనకిద్దరకు సంబంధ ముందని యిదివరకే అందరూ చెప్పుకుంటున్నారు కదా! దాని కేమి చెపుతారు?

వ : ఎవళ్ళ పాపం వాళ్ళది

క : నేను చస్తే ఆ పాపం మీది.

వ : అవాచ్యపు మాటలు మాట్లాడకండి. అబ్బాయికి పంపించ టానికి మీరు కొంచెం సాయం చేయాలి. పదియేండ్ల నుంచి మీదయవల్ల వాణ్ణి చదివించాను. ఈ యేడాదికూడా మీరే సాయపడితే వాడికి బి. ఏ. పూర్తి అవుతుంది. మీ పుణ్యము ఎక్కడికీ పోదు!

క : నాకు పుణ్యమక్కరలేదు. పాపమే కావాలి.

వ : మరి కొన్నాళ్ళు ఓపికపట్టండి.

క : ఈ మాట పదియేళ్ళమట్టి వింటున్నాను. బలవంతంగా మిమ్మల్ని నా దాన్ని చేసుకుందా మనుకున్నాను. లాభం లేకపోయింది. బ్రతిమాలితే మీకు దయ కలుగుతుందేమో అనుకున్నాను. ప్రయోజనం లేకపోయింది. ఈ పదేళ్ళ నుంచీ యెట్లాలేదన్నా ఆరు ఏడు వేలు మీ కొడుకు చదు వుకి పెట్టాను. ఫలితం లేకపోయింది. పదేళ్లయింది. నా తలంతా తెల్లపడ్డది. మీతలకూడా నెరుస్తోంది. ఇంకా ఓపికపట్టండి! ఇంకా ఓపికపట్టండి. చచ్చేదాకా ఓపిక పట్టాలి.

వ : మనశవాల రెంటికీ పెళ్లి జరుగుతుంది.

క : అదుగో! వసుధ అంటే ఆ మాటలోవుంది. సెలవు. వెళతాను. (నిష్క్రమణ)

వ : నాన్నా!

భ : (ప్రవేశించి) ఏమిటి నాయుడుతో మాట్లాడుతున్నావు?

వ : అబ్బాయి డబ్బుకోసం వ్రాశాడు చెన్నపట్నంనుంచి. నాయుడుగారిని అడిగాను

భ : ఏమన్నాడు. ఇస్తానన్నాడా?

వ : నా మనోవర్తిపట్టి తిండికే చాలవాయెను. వాడన్నా యీ పరీక్షి ప్యాసయితే యెక్కడయినా పదిరాళ్ళు తెస్తాడనుకొంటే యీ యేడాది పూర్తిఅయ్యేటట్లు కనిపించలేదు. బుచ్చిమామని అడిగావా?

భ : ఈ వృత్తాంతం మాట నాకేమి తెలుసు!

వ : ఈ డబ్బుమాట కాదు. ఆయన మన కివ్వాల్సింది యిస్తానన్నాడా?

భ : అబ్బో! అతగాడువంద చదివాడు. అమ్మా! తలవెంట్రుకలు తీయించుకోవే అంటే నీవు నా మాట వినవుకదా! నేను వస్తున్నాకదా అని పూలజడ వూడతీస్తున్నావు. నేనుచూశా. ఈ పునిస్త్రీతనమల్లే వుంటే ఎవరన్నా ఏమన్నా అంటారు.

వ : బుచ్చిమామ యేమన్నా అన్నాడా యేమిటి? ఆయన అంతే. మన కివ్వాల్సిన డబ్బడిగితే సరి, ఈకథ యెత్తుతాడు.

భ : అమ్మా! మనలో దోష ముంటే ఎవరన్నా ఎత్తుతారు.

వ : నాన్నా! నీకుకూడా అనుమానమేనా!

భ : తల్లీ! అదికాదు. నాయుడు మనయింటి కల్లా వస్తూంటే, నీతో అల్లా మాట్లాడుతోంటే, మన కీ యప్రతిష్ఠ వచ్చింది.

ఈ అప్రతిష్ఠ ఇవ్వాళ్ళటిదా? నిన్నటిదా? పాతపడిపోయినా క్రొత్తదల్లేవుంది.

వ : నాన్నా! ఆ పుణ్యాత్ముడిమూలంగా పిల్లవాడికి నాలుగక్షరం ముక్కలు వచ్చినై. ముందునాటికి వా డెక్కడన్నా ఒక అరవయ్యో, డెబ్బయ్యో తెస్తోంటే ఎలా వుంటుంది చెప్పు. నాయుడుగారు నా పాలిటి దేవుడు. ఆయన్ని నే నెట్లా కాదనను.

భ : ఆ మాట నిజమే సరే! డబ్బుమాట ఏం చేశావు?

వ : ఆయనతో జెప్పాను. ఆయనకి యింట్లో యేదో ఖర్చు వుందన్నారు. ఏమీ తోచటంలేదు.

రా : (ప్రవేశించి) నాయుడుగారు ఈ యాభై రూపాయలు మీ కిమ్మన్నారు. రెండుమూడు రోజుల్లో మిగతా పైకం పంపుతామన్నారు.

భ : ఇటు తెండి. [పుచ్చుకొనును]

భ : అయ్యా! దయచేయండి. [రాధ కూర్చుండును]

భ : తమ రేమన్నా సంస్కృతం చదువుకొన్నారా అండి.

రా : ఎక్కువవేమీ చదువుకోలేదు. ఏదో పద్యాలు వ్రాస్తాను. అంతే.

భ : చదువుకోకుండా వ్రాస్తే కవిత్వంలో పటిమ వుండదండి. చదువుకోవాలి నాయనా!

రా : వసుధగారు ఎందుకో దుఃఖిస్తున్నాట్లల్లేవుంది. ఎందు కండి అల్లా కన్నీరు కారుస్తున్నారు?

వ : ఏమీలేదండి.

[కన్నీరు తుడుచుకొంటూ నిష్క్రమించును]

రాధ : ఎందుకండీ మీ అమ్మాయిగా రేదుస్తున్నారు?

భ : ఏమీపటంలేదండి. కళ్ళల్లో ఏమన్నా పడ్డదేమో! పాండిత్యములేని కవిత్వమండీ?

రాధ : పాండిత్యంవుంటే అసలు కవిత్వమే రాదండి. ఇంతంత లావు శబ్దాలు వేసి అసహ్యం చేస్తారు. భాష తక్కువా, భావ మెక్కువా వుండాలి. మీ అమ్మాయిగా రిప్పుడు బయటకు రారా అండి?

భ : ఎందుకు?

రాధ : చెప్పిపోదామని.

భ : నేను చెపుతాలెండి. తమరు వెళతారా.

[నిష్క్రమించును]

రాధ :

గీ॥ వెలుగురాచిన నా గొంతు మలగి మలగి
రాగమెడలించె బీరనరాలు బిగిసి
పరమపరమార్థగీతిక పలుకలేని
మెట్లకిన్నెరతీగలు చిట్లిపోయె

గీ॥ ఓ ప్రణయశీల! నేను నిశాప్రశాంత
గాఢ తమసాకృతిని నీవు కలలోదిగిన
చటుల సౌదామనీరేఖ విటుల నాదు
దివ్య సన్నిధికే దారి తీసినావు.

తెర [నిష్క్రమణ]

# తల్లి లేని పిల్ల

## తృతీయాంకము

[కళ్యాణి యిల్లు—ప్రవేశము: సంగం, కళ్యాణి]

క : ఏమండీ! ఎల్లావుంది స్థితి?

సం : ఆమెను ఏదో నాటకాలల్లో వేషంవేసేవారి ఆత్మ ఎవరిదో వచ్చి గ్రహించింది. మొదటిసారి ఉద్ధృతం అల్లాగే వుంటుంది. ఎవరో మాస్టరు రెనడే అట.

క : వచ్చాడా?

సం : ఊ! ఆవిడను నేను నిద్రలోనికి పంపించాను.

క : ఎప్పుడు మేలుకొంటుంది?

సం : సరిగా రాత్రి రెండు జాములకు. ఆవిడ లేచే టప్పటికల్లా ఆవిడ కాహార మేమైనా యివ్వాలి.

క : ఓవల్టీను పనికివస్తుందా?

సం : ఏదో ఒకటి. రేపు రాత్రిదాక ఆవిడతో ఎవ్వరూ మాట్లాడకూడదు.

రా : (ప్రవేశించి) ఇవాళ శుక్లచతుర్దశి.

సం : వారం?

క : ఆయన ఏమన్నా పంచాంగంబ్రాహ్మడా!

సం : ఇదేమన్నా ప్రొద్దున్నా!

రా : అబ్బో! ఈయన చాలా విషయాలల్లో ప్రొఫెసరే!

[illegible] : [illegible] అయితే?

[illegible] : [illegible] అన్నమాట.

సం : [illegible] పాడ్యమి.

[illegible] : అప్పటికి దిగుతుంది పిచ్చి.

సం : ఎవరికి?

రా : ఎక్కినవాళ్ళకి. సరేకాని నాయుడుగారూ! మీరు చంద్రోదయం చూడలేదు. ఇవాళ ఎంత జగన్మోహనంగా వుందనుకొంటున్నారు.

రెనడే : (ప్రవేశించి)

> ఆపి సెమొక్కను నేను 'రాధాకి' నాదు
> పైకి నెగబ్రాకు తామలపాకుతీగ.

సం : అదేం రాగమండి?

రెనడే: బేగడ.

సం : మీగడలా వుంది సుమండి.

రెనడే: అది మీరసజ్ఞతలో వుంది.

రా : మీగడలా వుంది అసలురాగమా, ఆయన పాడిందా?

రెనడే: మీరు కవులాయెను.

సం : ఏదండీ ఆ పద్యం. పీ రీ పద్యం, చదివితే వన్సుమోర్లు, చప్పట్లు పది నిమిషాలదాకా ఒకటే రొద.

రా : ఇక మళ్ళీ తోచదు కాబోలు!

సం : ఏదీ పాడండి!

రా : పాపం! అదేమిటండీ అట్లా అంటారు.

రెనడే: అవిసెమొక్కను నేను 'రాధాక్షి' నాదు
పైకి నెగ్రబ్రాకు తామలపాకు తీగె.

సం : రాగం మార్చారే.

రా : యాక్టరు కాదూ! ఒకరిని మార్చి ఒకరిని, ఒకటిమార్చి ఒకటి.

రె : ఈ కవులకి మహా గర్వమండీ. పద్యం చివరిదాకా అన్నా చదువనీయవయ్యా?

'అవిసె మొక్కను నేను 'రాధాక్షి'

రా : రాధాక్షి యేమిటి?

రె : 'రాధ' అన్నమాట.

రా : కుంకాక్షి అంటే కుంకఅల్లేనా?

రె : రాధాక్షి అంటే రాధ కాదా?

రా : ఎందుకు కాదు. నేను చెప్పిన సూత్రంప్రకారం అవుతుంది.

రె : మరి కవి యెందుకు వ్రాశాడు?

రా : ఏదిరాస్తే యేం? ఆడేందుకు మన మున్నాంగా! అందుకు!

రె : నాయుడుగా రేమీ మాట్లాడరేం?

క : మీ రాడే నాటకాలన్నీ యిట్లాగే తగులడుతున్నవి. దాని కేమిలే; పాడండి.

సం : ఈయన పాడనిస్తేగా!

రా : నేను వెన్నెలలోకి పోతాగాని మీరు పాడుకోండి.

సం : మేడమీదికిమాత్రం వెళ్ళకండి.

రా : పిచ్చాసుపత్రి అక్కడా ఏమిటి?

రె : అక్కా అయితే మిమ్మల్ని ఎందుకు వెళ్ళవద్దంటానూ.

రా : ఇంకోరకం పిచ్చివున్నా మీకు డబ్బిచ్చే పిచ్చిమాత్రం నాకు లేదు.

రె : అందరికీ డబ్బిచ్చే పిచ్చి నాయుడుగారికి సమృద్ధిగా వుంది. మనం ఒకళ్ళతో ఒకళ్ళం పోట్లాడుకోవట మెందుకు?

రా : అందులోనే తారతమ్యము లున్నవి.

[నిష్క్రమించును]

రె : కొంచెం కవిత్వం వ్రాయటంతోనే భూమీ ఆకాశం పట్టదండి.

సం : మొగానికి బూడిదపూసినా అంతేనండి.

రె : మెస్మరిజం అంటే ఇదొక గారడీఅండీ. వెనక మా వూళ్లో యిట్లాగే ఒక మెస్మరిష్టు వచ్చి యేం మెస్మరిజము చేశాడో, ఆయన వెళ్లేటప్పటికి ఒకళ్ళింటో నానుత్రాడు పోయింది. ఇంకొకళ్ళింటో బంగారపు గాజులు పోయినై.

సం : అదిగో చూశారా ఎంత కోపం వచ్చిందో?

రె : అదికాదండీ. ఎవళ్ళెటువంటివాళ్లో తెలియకుండా మాట్లాడతారేమిటి! మేమూ ఏదో గొప్పవాళ్ళమే అనుకొంటున్నాము. మాకూ పేరూ, ప్రతిష్ఠా వున్నవి.

సం : నేను లేదన్నానా! బర్మాలోగూడ మీ ప్రతిష్ఠ మోగిపోతోంది.

రె : యెక్కిరింపు ఏమిటి నువ్వు? అవును బర్మాలో నా పేరు మోగిపోతున్నమాట నిజమే.

సం : నేనూ అదేగా చెపుతున్నది.

రె : చాలులేవయ్యా! ఇంకవూరుకో, నాయుడుగారూ! మీ రీ మెస్మరిస్టులని నమ్మకండి. వీళ్ల ఎంతకన్నా తగుదురు. తరువాత పస్తాయించి లాభం లేదు. ఏమి! అంతకోపంగా చూస్తే భయమా ఏమి? నిజము చెప్తున్నా!

క : ఎబ్బే! బాగాలేదు. సరే పదండి, మీకూ భోజనం వేళయింది.

రె : సెలవు— [నిష్క్రమణ]

క : ఇప్పుడు తొమ్మిదవుతుందనుకొంటాను. మేడమీదికెవ్వరం వెళ్ళకూడదా?

సం : వంటవాణ్ణి అన్నంతీసుకెళ్ళి గదిలోపెట్టి రమ్మనండి. ఆవిడకి మెలకువ వచ్చినపుడు ఆవిడే తింటుంది. నేను వెళ్ళి భోజనంచేసి వస్తా.

క : మీరువచ్చి మీగదిలో పడుకోండి. మీరు వచ్చేటప్పటికి నేను నిద్దరపోతుంటానేమో!

సం : చిత్తం. [నిష్క్రమణ]

క : రాధాకృష్ణగారూ!

రా : (ప్రవేశించి) భోంచేద్దామా! ఈ పూట నా కేమీ ఆకలి లేదండి. మీరు పోయి భోంచెయ్యండి.

క : ఆకలి అయినంతే తినండి.

రా : ఏమీ ఆకలిలేదు.

క : సరే నేను భోంచేసి పోయిపడుకొంటాను. ఇవ్వాళ యేమిటో ప్రాణం సొరపోయినట్టుందండి. మీ రీ గదిలోనే పడుకొం టారుగా. [నిష్క్రమణ]

రాధ

గీ. ఇంటిలోన సర్పము ప్రవేశించి భయము
కలుగఁజేయు చెల్లెడఁ దిరుగాడినట్లు
అల్లనల్లనఁబడి తిరుగాడఁ జొచ్చె
నాదు మనసున నేదో విషాదరేఖ

గీ. తొల్లి నిజముగ నేనొక దుఃఖలోక
వాసుడను నా కచట నిల్లు వాకిలియును
గలదు చిఱుగొంతు మలచు చీకటులపాట
పాడిపోవంగ నిచటికి వచ్చినాను.

రాత్రి చాలాపోయిందల్లే వుంది. నాకు నిద్ర పడుతుందా? పట్టదు. ఈపాటి కందరూ నిద్రపోయివుంటారు. మేడమీదికి వెళ్ళిరానా? ఎవరైనా చూస్తే! ఎవరు చూస్తారు. నాయుడుగారు సొమ్మసిలి నిద్రపోతుంటాడు. ప్రొఫెసరూ నిద్రపోతున్నాడనుకొంటా. నాయుడుభార్య ఎంత అందకత్తె! నా కవిత్వం చాలా ఆదరిస్తున్నాడు. ఆయన భార్యనుగురించి యిల్లా యెందుకు ఊహించటం. నిద్రపోతాను.

ప్రేమ మహాశక్తి. దానిముందర యేదీ ఆగదు. కృతజ్ఞత, నీతీ, స్నేహము—ఇవన్నీ చాలా అల్పవిషయాలు. ప్రేమ మహాధికవిషయం. దానిముందర త్రిమూర్తులే దాసోఽహమంటారు. స్త్రీప్రేమ లభించిందా! ఆ పురుషుడు తేజోమూర్తి అయిపోతాడు. వాడిముందర దేవేంద్రుడెందుకు? వానికంటె అదృష్టవంతుడు లేడు.

(మేడమెట్లెక్కుట యభినయించును) నేను మేడ ఎక్కుతున్నానల్లే వుందే. మనస్సు చాలా చిత్రంగా వుంది. ఒకటేసారి రెండూహ లూహిస్తుంది. పైకి విస్పష్టంగా ఒకటి ఊహిస్తోంటే లోపల మరొక ఊహ సాగుతోంది అన్నమాట. చదువుకొన్న మనస్సు న్యాయాన్యాయాలు విచారిస్తోంటే, వాంఛలు జీర్ణించిన యీ శరీరానికి సహజప్రకృతి అయిన లోపలి మనస్సు తన ఊహ తాను చేసుకొంటూనే పోతూంది. శరీరం దాని ఒద్దికలోది. అది నన్ను నాకు తెలియకండానే మేడమెట్లు ఎక్కించింది.

[తెరయెత్తగా నిద్రపోతున్న చంద్రమతి]

ఆహా! ఏమి అందం. ఈవిడ అప్సరసగాని మనిషి కాదు. పోయి తాకుదునా! నిద్రలేపుతాను. ఆవిడ ఏమంటుందో ఇంత దూరంవచ్చి భయమెందుకు?

[పోయి నిద్రలేపును]

చం :- (లేచి) ఎవరు మీరు?

రా : (మాట్లాడడు)

చం : నీవా! కపిత్వటుడవు. ఈ గదిలోకి ఎందుకు వచ్చావు. ఛీ! ఛీ! అవతలకు వెళ్ళు. రామన్నా!

రా : నేను వెళ్ళిపోతున్నానులే. ఎవరిని పిలవకండి. తప్పుచేశా. క్షమించండి. నాయుడుగారితో చెప్పకండి.

[నిష్క్రమించును.]

చం : నే నిక్కడ పడుకున్నా నేమబ్బా! ఎంత నిద్రపోయి నాను. వా రెక్కడ పడుకున్నారో! ఈ కవిగాడి కేమి పోయేకాలం. మగవాళ్ళ కిదేమి రోగం? నా ఒళ్ళంతా చిత కబొడిచినట్లుందేమి? అబ్బా! ఆకలి అవుతోంది. క్రిందికి పోయి వంటవాణ్ణి లేపనా యేమిటి? ఈకవినేమి చెయ్యాలి? నాయుడుతో చెప్పనా. ఇదివరకెప్పుడూ సరిగా మాట్లాడని దాన్ని యివ్వాళపోయి యిది చెప్పటం ఎందుకు. పోనియ్యి!

సం : (నెమ్మదిగా ప్రవేశించును.)

చం : ఈయన యెవరు? వైద్యుడు కాదూ!

సం : ఒంట్లో యెట్లా వుంది?

చం : మీ వైద్యం నా కక్కరలేదంటే నా వెంటబడి నా ప్రాణం తీస్తారెందుకు బాబూ! మీకు వేయిదణ్ణాలు. వెళ్ళిపొండి.

సం : మీరు నాయుడుగారి నెందుకు ప్రేమించరు?

చం : మా సంసారవిషయం మీ కెందుకూ?

సం : అదికాదమ్మా! అంత కష్టపైవిరుపుగా మాటాడతావేం?

చం : ఈ అర్ధరాత్రివేళ నా గదిలోకి మీరెందుకు వచ్చారు?

సం : నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీకు నాయుడుగారి మీద యిష్టంలేకపోతే నాతో వచ్చేసెయ్యండి. చక్కని దేహం, ప్రాణం ఎందుకు వృథాచేసుకుంటారు. నేనంటే నేనుకాదు. మీ యిష్టంవచ్చినవాళ్ళతో వుండండి.

చం : వైద్యులు కనక మీ రిక్కడకు రావచ్చు సరే. యిష్టం వచ్చినట్లు మాట్లాడవచ్చును కూడానా?

సం : మీ మంచి కోరి చెబుతున్నాను. తరువాత మీ యిష్టం. మీరు కాపరానికి వచ్చి ఆరేండ్లయిందట. భర్తతో సరిగా మాట్లాడనైనా మాట్లాడరట. నేను యిష్టము వచ్చినట్లు మాట్లాడ రాకపోతే యిక్కడికి నే నెట్లా వస్తాను.

చం : చాలులెండి: యింక దయచెయ్యండి.

సం : ఇప్పుడు ని న్నేమన్నాను. వెళతాలే. అదుగో అన్నము అక్కడ పెట్టించాను. ఆకలవుతోంది గాబోలు; తినండి.

[నిష్క్రమించును]

చం : ఈయనా పెట్టించాడు అన్నం! నామీద అధికారం చేస్తా డేమిటి? ఈ మగవాళ్లు ఒకడికన్నా ఒకడు చిత్రపు మనుష్యులే. నాయుడు ఇతన్ని తెచ్చాడు కనక అతని యిష్టం వచ్చినట్లు మాట్లాడవీలయింది. నాకేదో మందిచ్చి నిద్ర తెప్పించాడా ఏమిటి ఈయన. నేను పోయిన నిద్ర యేదో విపరీతంగా వుంచే,

క : (ప్రవేశించి) ఆకలవుతుంటే అన్నం అందులోవుంది.

చం : మాటిమాటికి వచ్చి కనుక్కొనేదానికి అన్నం యిక్కడ పెట్టడం ఎందుకు?

క : మాటిమాటికి రాలేదే. ఇప్పుడే వచ్చాను. వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతాను.

చం : ఇల్లు నాదా! నే నెవరిని. వెళ్ళిపొమ్మనేందుకు?

క : డాబామీద వెన్నెలగావుంది. అక్కడికి పోయి తినిరా!

[చంద్ర నిష్క్రమించును]

క : నిద్రలేచి చాలాసేపయిందట్లే వుంది. నే నివ్వాళ గాఢనిద్ర పోతాననుకొన్నాను. నిద్రే పట్టలేదు.

[చంద్రమతి లోనికి వచ్చును]

క : అప్పుడే అన్నం తినటం అయిపోయిందా?

చం : నాకేమీ జబ్బులేదుకదా! నాకీ వైద్యమెందుకు?

క : నీవు నన్ను ప్రేమించేందుకు.

చం : నేను మీ యింట్లో వున్నాను. ఎక్కడికీ వెళ్ళను. ఇదిగో నా శరీరం మీది. నే నెప్పుడు కాదన్నాను.

క : నేను పశుబలం వుపయోగిస్తే అర్ధాంగీకారంగా నీ శరీరం నాదే. నీ ఆత్మ నాది కావాలి. నేను నిన్నెల్లా ప్రేమిస్తున్నానో,నీవు నన్నలా ప్రేమించాలి.

చం : నా కర్థం కావు మీరనే మాటలు.

క : ఇవ్వేళ మధ్యాహ్నం అన్నావే 'అవి చూపులా, మన్మధుని బాణాలు. అవి నా హృదయంలో చొరబడినవి.

రంగుల సుళ్ళు తిరిగినవి. కాలువలయినవి' అంటూ, అల్లా ఆవేశంతో నన్ను ప్రేమించాలి.

చం : మధ్యాహ్న మెప్పుడు?

క : అప్పుడు నీఒళ్లో నీకు తెలియదు.

చం : అంటే?

క : వైద్యుడు నీమీద కాక వేరేమనిషిఆత్మని తెచ్చి ఆవేశింపచేశాడు. అందుచేత.

చం : ఈ వైద్యుడు కొంపలోనుంచి యెపుడు వెళతాడు?

క : నీవు నన్నట్లు ప్రేమించేటట్లుగా చేసి.

చం : ఇంటి కెవరుపడితే వాళ్ల రావటమున్నూ, వాళ్ళ నేనొంటరిగావుండగా గదిలో ప్రవేశించటమునా? నామీద మీ కిష్టం లేకపోతే వెళ్ళిపొమ్మనండి, వెళతాను. అంతేగాని యిదేమీ బాగాలేదు.

క : వైద్యు డిక్కడికి వచ్చాడా!

చం : అందరూ వచ్చారు!

క : చూచిపోవటానికి వచ్చి పోయాడు కాబోలు. ఇంక నేను వెళ్ళనా? నిద్రపోతావా? మెట్ల తలుపు వేసుకో.

[తెరపడగా చంద్రమతి కనిపించదు]

క : ఇదిగో మెట్లు దిగి వచ్చాను. నా అదృష్టం అన్నిటికన్న బాగా వుంది. రాధాకృష్ణగారు మేలుకొనివున్నారేమో!

రా : (ప్రవేశించి) ఎవరో వస్తున్నారు. నాయుడు గారల్లే వుంది మేడమీదినుంచి దిగి వస్తున్నాడు. కొంప మునిగింది.

క : మేలుకొనే వున్నారా?

రా : నిద్ర పట్టందే.

క : ఇన్నేళ్ల యీ యింట్లో యెవరికీ నిద్రపట్టలేదా యేమిటి?

రా : మీరనే దేమిటో నాకు తెలియలా!

క : మీ కో రహస్యం చెప్పనా?

రా : (ఊర్పుతీసుకొని) ఏమి టది?

క : ఏవయినా పద్యాలు చదవండి.

రా : ఇంతకుముందే వ్రాశాను. నిద్రపట్టలేదు. ఆలోచిస్తోంటే పద్యాలు వచ్చినవి.

క : దయచేసి శ్రమ అనుకోకుండా ప్రొఫెసరుగారిని పిలుచుకు వస్తారూ?

క : ఆ.... [నిష్క్రమించును]

రా : డబ్బు పంపిస్తే వసుధ ఏమనుకుందో? చంద్రమతిమీద ఇప్పుడు మళ్ళీ ఆ ఆత్మని ప్రవేశపెడితే? ఒక్కొక్కడి జీవితం చిత్రం. నాది మరీను.

సం : (ప్రవేశించి) పైకివెళ్ళి చూచి రమ్మంటారా?

క : మీ రింతకుముందు వెళ్ళివచ్చారటగా!

సం : ఆవిడ లేచిందో లేదో చూద్దామని వెళ్ళాను.

క : మళ్ళా మెస్మరైజు చేయవచ్చునా?

సం : ఎప్పుడు?

క : ఇప్పుడు.

సం : రేపల్లా ఆగాలి. నిద్రవస్తోంది. వెళతా. [నిష్క్రమణ]

రా : [ప్రవేశించును]

క : ఇప్పు డెన్నిగంట లవుతుంది?

రా : పద్యాలు వింటారా?

క : ఊఁ, చదవండి.

రా : ఇంటిలోన సర్పము ప్రవేశించి

.... .... .... .... .... ....

తొల్లి నిజముగ నే నొక దుఃఖలోక

.... .... .... .... .... ....

[అను పద్యములు రెండు చదువును]

క : హా! హా! మహాకవివి. మీకు నమస్కారం.

[ తెర ]



# ప్రత్రే నిపిల్ల

## చతుర్థాంకము

[వసుధ యిల్లు: తండ్రి, కూతురు]

భ : అమ్మా!

వ : ఏమి నాన్నా!

భ : నీవు నా బంగారుతల్లివి కాదూ!

వ : ఏమిటి?

భ : ఏమీ లేదమ్మా!

వ : నాన్నా, నా కెనేళ్ళే?

భ : ఇది ఇరవై అయి దనుకుంటా!

వ : కాదే; నాలుగేండ్లు. నాకు ముప్ఫైయేళ్లు దాటినై. ముప్పై రెండు.

భ : అయితే ఏం?

వ : అయితే నే నింకా నీకు పసిపిల్లల్లేనే కనపడతానా?

భ : తల్లీ! అదేమిటోకాని నాకు నీవు ఏడాది పిల్లల్లే వుంటావు అమ్మా! మీ అమ్మ పోయేటప్పటికి నీవు ఏడాది పిల్లవు కాదమ్మా! తల్లీ! నిన్ను పెంచేదుకు నే నెన్నికష్టాలు పడ్డాను! అర్ధరాత్రివేళ లేచి పోరుపెట్టేదానవు. అపుడు పాలు పట్టేవాణ్ణి. మీ అమ్మ నీకు జ్ఞాపకంవచ్చేది కాదు. తల్లీ! నిన్నలా చేతులమీద పెంచుకొన్నాను. మీ అమ్మ అచ్చంగా నీకుమల్లేనే వుండేదమ్మా! నీవు మీ అమ్మ

కన్న కొంచెం ముదురు తేలేవు. మీ అమ్మ లేత తమల పాకు. దాని అందం ఏమని చెప్పను!

వ : నాన్నా! ఈ కథ నా కెన్నివందలసార్లు చెప్పావో లెక్క లేదు కదా! నీకు విసుగులేదా?

భ : అమ్మా! నీకు విసుగుగా వుందా?

వ : లేదు నాన్నా! లేదు.

భ : అమ్మా! నేను మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. మీ అమ్మవంటి దాన్ని పోగొట్టుకొని యింకోదాన్ని ఏమని చేసుకోను.

వ : మా అమ్మ చచ్చిపోయిందిగా!

భ : చచ్చిపోయిందా! అవునమ్మా! చచ్చిపోయింది.

వ : నేను మగవాణ్ని అయినా బాగుండేది. నీకు ఇన్నినీళ్ళు పోసేది ఎవరు నాన్నా?

భ : నిక్షేపమల్లే దౌహిత్రుడుంటే నాకేమమ్మా?

వ : నాన్నా! ఎంత దౌహిత్రుడున్నా కొడుకుదారి వేరు. పైగా కళింగం లక్షణాలన్నీ బాగాలేవు. వాడు బ్రాహ్మణ్యంలో వుంటాడని నాకు తోచదు.

భ : ఓరినాయనా! ఆ నాయుడుగారింట్లో నీళ్ళు త్రాగవద్దురా, అన్నం తినవద్దురా అంటే వాడు వినడు. బ్రాహ్మణ్యం కాస్తా చెడ్డతరవాత వాడు వదిలిపెట్టే నీళ్ళు నాకందుతై అని నాకు నమ్మకమూలేదు. సరేలే. ఇపుడు లోకంలో అందరు బ్రాహ్మలూ తగలడ్డారు గనక మనము

లేదని దిగులా? వాడికి మిగతా డబ్బు పంపాట ఏమే మాలో చింపావా? నాయు డేమన్నా పంపిస్తాడా?

వ : నీ పెదవో శ్లోకము చదువుతావు, ఉత్తరరామచరిత్రలోదని, మహాత్ముల మనస్సు లిట్లా వుంటయ్యని.

భ : 'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి. లోకోత్త రాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి.'

వ : అదుగో అల్లాంటిది, ఆయన మనస్సు. నే నేం చెప్పను, ఎప్పుడిస్తాడో! ఎప్పు డివ్వడో! వీడేమో పట్నంలో కూర్చుని ఉత్తరాలు ఉరికిస్తున్నాడు. నే నెక్కడనుంచి పంపిస్తా ననో వాడి వుద్దేశం.

భ : వెనక ఉత్తరంలో వ్రాశాడుగా! నాయుడుగారి నడిగి పంపించమని.

వ : నాయుడుగా రెందు కిస్తాడో!

భ : ఎందుకిస్తాడేమిటి? మబ్బులు వాన యెందుకు కురు స్తున్నవి. చెట్లు పూలెందుకు పూస్తున్నవి.

వ : ఆయనంటే నా కింత గౌరవమని ఆయనకి తెలియదు. ఆయనని చూస్తే నీకు కోప మనుకుంటా డాయన.

భ : తల్లీ! ఈ ప్రపంచం నా కర్థంకాదు. అర్థంకాక అర్థం కానిదల్లా తప్పంటారు లోకంలో మనుష్యులు. నే నట్లా అనలేను. ఇటు వర్ణాశ్రమాలు వున్నవి. అటు ధనవం తులు, పేదవాళ్లు వున్నారు. ఏ భేదాలు నశింపచెయ్యాలి. వర్ణభేదాలు కాదు అంటాము. అసలు భేదాలే లేవా! ధన

వంతులు, కానివారు, అధికారులు, అనధికారులు-ఇలాంటివి లక్ష భేదాలు కనిపిస్తున్నా ఒక భేదంవల్ల జరిగే అన్యాయం అన్యాయమయి, యింకో భేదంవల్ల జరిగే అన్యాయం అన్యాయం కాదా! ఏ భేదమూ లేకుండా ఎవడు చేస్తాడు? చేస్తామనేవాడు మూఢుడు. వాడికన్న మిథ్యావాది లేడు.

వ : అందుకని యేమంటావు?

భ : ఆయన పరమ దయాస్వరూపుడు. మనము మనుష్యులమైతే ఆయన దేవతాస్వరూపుడు. కాని మనము బ్రాహ్మణుల మవటం, ఆయన కాకపోవటం, ఈ భేదంవల్ల మనస్సుకు కష్టంగా వుంది.

వ : అయన దేవతలలోవాడు. మనం బ్రాహ్మలం. ఎవరెక్కువ?

భ : గుణంచేత ఆయ నెక్కువ. కులంచేత మనము.

వ : కులం మనం కల్పించిందికాదూ?

భ : గుణమూ మనం కల్పించిందే.

వ : కాదు. గుణం నిత్యంగా వుంది. మనం మోసంచేసి కుల మని పెట్టాము.

భ తల్లీ! ఇదివరకు వాదించిందే మళ్ళీ మొదలుపెట్టావు. వాదానికి చివర ఏముంది?

వ : నిజమే నాన్నా! వాదించేవాడి యిష్టాయిష్టాలున్నవి. కాని నా కక్కడ ముడి తెగటంలేదు.

భ : అదే సంస్కారం. కర్మనిబట్టి వుంటుంది. ఎవరి సంస్కారఫలం వారిది. పోట్లాడితే ఏం లాభం?

వ : బాగుంగా వున్నవాడు పోట్లాడుతాడు. నీకేమి.

భ : పోట్లాడనియ్యి! నాకేం? నేను భగవంతుణ్ణా, వాడి కిష్టమయితే నాకే మభ్యంతరం?

వ : మరి లోకంలో బ్రాహ్మ లెందు కట్లా పోట్లాడతారు?

: వీళ్ళెందుకిల్లా పోట్లాడుతారు వీళ్ళ కేమో వస్తోందని వీళ్ళు. వాళ్ళ కేమో పోతోందని వాళ్ళు. వాదిస్తోంటే మనం మాట్లాడే మాటల్లో యెంతెంత విషయాలు మనం చూడ లేమో మనకు తెలియదు. ఎందుకు పోనీయి. ఒక్కటే రహస్యం. లోకంలో తనకి కావలసింది, ఇష్టమైనది, ఎవరికన్నా వుంటే వాని కవి చేసుకునే వీళ్ళుంటే చేసుకుంటాడు. లేకపోతే నోరుమూసుకు వూరుకుంటాడు. అదీ తత్త్వం. దేశమూ, కాలమూ వాళ్ళకి వీలుగావుంది. చేసుకోనియ్యి.

వ : ఆ గోల నా కెందుకు గాని, అబ్బాయికి డబ్బు పంపించాలసిన మాట యేం చెప్పావు?

భ : మళ్ళీ క్రొత్త చదువా! నాకున్న ప్రతిదమ్మిడీ నీ పెళ్ళికీ, నీభర్త చదువుకీ, నీ కార్యానికీ తుడిచిపెట్టాను. ఈ ఇరవై యేళ్ళమట్టి నీ వన్నం పెడుతున్నావు. నేను తింటున్నాను. ఈ యిల్లుంది నాది. ఇది యిష్టంవచ్చినట్లు చేసుకొమ్మని యీ పదేళ్ళమట్టీ చెపుతున్నాను.

వ : నాయుడుగారు డబ్బు పంపిస్తానని పంపించలేదు. కళింగం మళ్ళీ రెండు త్తరాలు వ్రాశాడు. ఇవ్వాళ వచ్చిన వుత్తరం మరీ ఘోరంగా వుంది. సెలవ లిస్తారట. డబ్బు పంపిస్తే గాని అక్కడ అన్నీ సర్దుకొని రావటానికి వీలులేదట. ఏం చెయ్యమంటావు?

భ : నాయుడికి కబురు పంపించు.

వ : నీవు పోయి అడిగివస్తావా?

భ : (ఊరకుండును)

వ : నేను పోయి అడిగిరానా? ఇంతమట్టుకు నే నాయనయిల్లు మొగం ఎరగను. వారింటికి వెళ్ళితే అదేం తప్పో!

భ : అమ్మా! ఎవరి పుణ్యపాపాలకు వాళ్ళఅంతరాత్మలుసాక్షి. బంధువులూ, కులంవాళ్ళూ భోజనాలకి రామని బిగిసేవాళ్లు, వెలిఅని యేడిచేవాళ్ళే కాని ఆపదలకి అడ్డం వచ్చేవాళ్లు కాదు.

వ : వెళ్ళిరమంటావా?

భ : వెళ్ళిరా! మరేం చేస్తాం? ఇంతా అయిపోయింతర్వాత ఇంకా మూడు నెలల్లో వుంది చదువు. ఈనగాచి నక్కలకు వదలిపెట్టినట్లు యిప్పుడు మానిపిస్తావా?

వ : అయితే వెళుతున్నా— [నిష్క్రమణ]

భ : అదుగో! మా వసుధ నడుస్తోంటే వాళ్ళఅమ్మ నడిచినట్లే వుంటుంది. నాకు యేభై యేళ్లు వచ్చినవి. ముప్పైయేళ్ళ క్రింద పోయిన దానిమీదనే వున్నవి నాప్రాణాలు .నామనస్సు కొంచెం రామా కృష్ణా అనుకోరాదూ! ఇదేవో చచ్చి పోయిన భార్యాకోసం తపస్సు చేస్తున్నట్లుంది నా బ్రతు

కంతా. నా కిన్నేళ్ళు వచ్చి నేను ఇంకా ఆ పూర్వపు భార్య కోసం ఏడుస్తున్నానంటే చూచేవాళ్ళకు, వినేవాళ్ళకు నవ్వుగా వుండవచ్చు. నాకు వయసుముదరటం నా శరీరానికే తెలుసుగాని నా యాత్మకు తెలియదు. ముప్పది యేళ్ల క్రిందటి ఆత్మనే వెంటపెట్టుకువస్తున్నాను.

బుచ్చిమామ : (ప్రవేశించి) ఏమయ్యా! బావా ఏమిటి ఆలోచిస్తున్నావు? అమ్మాయి ఇంట్లో లేదా?

భ : నాయుడుగారింటి కెళ్ళింది.

బు ; నాయుడుగారింటికా! ఇదెప్పటినుంచి? ఇదివరకు లేదే. ఇదివరకున్నది చాలదుటయ్యా? వాళ్ళింటికికూడా వెళ్ళట. రావటం జరిగితేగాని సర్వలక్షణాలు పూర్తికావా యేమిటి?

భ : కళింగానికి డబ్బు పంపించాలి. నీ వివ్వాలిసిన డబ్బేమో నాలికపీక్కుచచ్చినా ఇవ్వవు. వాడిచదువు ఇంకా నాలుగైదు నెలల్లోకి వచ్చింది. ఇచ్చేమహారాజు ఆయన ఒక్కడున్నాడు.

బు : లేకపోతే నీ కిష్టం లేకుండా యింతదూరం వచ్చిందటలే.

భ : ఇదిగో! బుద్ధిలేకండా మాట్లాడకు

బు : నీకు కోపమెందుకు. ఆయన కిచ్చి పెళ్ళిచెయ్యి. ఇబ్బందే తీరిపోతుంది ఇహ మేము రానే రాము.

భ : వచ్చి యేం ఒరిగిస్తున్నావు. ఈ బ్రాహ్మణ్యంమాట నాకు చెప్పక. చస్తోంటే ఎవ్వడూ సహాయంచెయ్యడు. తిరిగి చూడడు. కొంచెం నెరుసు వచ్చిందంటే భోజనాలకు రారు. వెలివేస్తారు. గుసగుసలాడుతారు. సుద్దమైనకొంపేదీచూపించు.

బు : నీ కిష్టమైతే సరే, అందరిమీదా పడతా వెందుకు. అందరూ

ని న్నేమన్నారు.

భ : అందరూ అనేదేగా నీ వనేది.

బు : అయ్యో! నీ కూతురుని నాయుడుగారింటికి పంపించు. నీ మనమణ్ణి వాళ్ళింటో తినిపించు. అన్ని మాలకూళ్లు తినిపించు చెయ్యి. కోపంకూడా యెందుకు. లోకంలో బ్రాహ్మలు నీకుమల్లే చేశారా?

భ : అదిగో, పిచ్చికూతలు కుయ్యకు. నాకేం, నా కూతురుకేం? నాయుడు మహానుభావుడు. అతడు కళింగం చదువుకి పదివే లిచ్చాడు. ఏదీ, ఆమాత్రం వుదారుణ్ణి మన బ్రాహ్మల్లో చూపించు. తన కొడుకు చదువుకి పదివే లిచ్చినవాడింటికి కొడుక్కి మళ్ళీ డబ్బు పంపించాలిసి మా అమ్మాయి వెళితే తప్పా! ఇందులో తప్పేమీలేదు. తప్పులన్నీ మీ బ్రాహ్మల్లో వున్నవి. చెప్పమంటావా? ఇదిగో ఇంగ్లండుపోయి మధుమాంసాలు కుడిచినవాళ్ళు పెద్దపెద్ద వుద్యోగాలలో వుంటే వాళ్ళందరితోను మీరందరూ కలిసితింటున్నారు. సోమయాజులకొడుకులు బి. ఎల్లులు ప్యాసయి చేసే పనులు భగవంతుడికి తెలుసు. ఇవి యెవరికి తెలియవు. చాలు గాని అవతలకు పో.

బు : బావా! నాయుడు చాలా మంచివాడు. అదికాదు కాని, అప్రతిష్ఠ నీ వెరుగనిదా! తక్కినవన్నీ అట్లావుంచు. అమ్మాయి తలవెండ్రుకలు తీయించుకోరాదా! వాలుజడ లేమిటి? రంగురంగు చీర లేమిటి? ఇవన్నీ చూస్తే లోకం అంటుందా అనదా? ఇవన్నీ నీతో చెప్పిచెప్పి నా నోరు కాయ

కొ[illegible]. [illegible] ఫలితం కనిపించిందా! ఇంత [illegible]వు నీకు నేను చెప్పాలా! బ్రాహ్మణ్యా [illegible]యిందికాదు. అది మన కెందుకు. ఇవ్వాళ [illegible]న్ని వదిలిపెట్టిపోతున్నామా! ఆ కలింగాయి చూద్దామా అంటే వాడి వుద్దేశం వాడే గవర్నరని. వాడు చేసే అమంగళాని కంతూ లేదు; పంతూలేదు. నీవు చెప్పి వసుధ చేత ఆ జుట్టూ కట్టూ బొట్టూ మాన్పించాలి. కాని యిల్లా కోపంచేసి యేంలాభం చెప్పు!

భ : అవునోయి! ఏంచెయ్యాను. ఇంట్లో చెప్పినమాట వినదు. ఇందులో ఏముంది నాన్నా అంటుంది.

ఋ : దానిమాటకు నీ వెదురాడలేవుగా?

భ : అవునోయీ! ఆడలేను. ఏం చెయ్యను. దాని యేడాది అప్పుడు నీ చెల్లెలు పోతే, ఏమి చెల్లెలు సీతాదేవివంటి చెల్లెలు, అరుంధతివంటి చెల్లెలు, పోతే చచ్చిపోవాలసిన వాడిని బ్రతికివుండి దాన్ని పోషించుకువచ్చాను. అది యేది కావాలంటే అదల్లా చేశాను. నా తలయినా తాకట్టు పెట్టి దాని సుఖాలే గడిపాను! నీ చెల్లెలుఆత్మ సంతోషించాలని చేశాను, చేస్తున్నాను, చేస్తాను. నీవు నన్ను నిందించి ఏమీ లాభంలేదు

ఋ : అది కాదయ్యా! నీవు కొంచెం కొపగిస్తే అది నీ మాట వింటుంది. నీవు కోపపడవు.

భ : నేను కోపపడితే ఏడుస్తుంది. అది యేడిస్తే నా కడుపు తరుక్కుపోతుంది. అది చచ్చిపోతూ, నా కొక్కపిల్ల

నిచ్చిపోయింది. ఆ పిల్లని నేను సరిగా చూడలేకపోతే ఏ స్వర్గలోకాల్లోవుందో అది, అది యేమనుకొంటుంది. మే మిద్దరమూ రెండేళ్ళు చేశాము సంసారం. ఎల్లాచేశామో నీ కేం తెలుసు. అది చస్తే నేను బ్రతకననే అనుకున్నాను. అది పోయింతరువాత గాని బ్రతుకుతానని తెలియలేదు. వసుధకన్నీరు నే నిదివరకు చూడలేదు. ఇంక చూడలేను. ఏం చెయ్యమంటావు?

బు : బావా! నీ దంతా ఒకకథ. ఎన్నిసార్లయినా యిట్లాగే చెపుతావు. ముప్ఫైయేండ్ల క్రింద అది చావటం ఏమిటి? అది పట్టుకొని నీ విదేమిటి?

భ : అవును, నీకు ముప్ఫైయేళ్ళయినట్టుగానే వుంది. నీకేం తెలుస్తుంది. నాకు తెలుసు. నా యౌవనమంతా, నా జీవితమంతా, ఆ రెండేళ్ళసుఖంకోసం, దాని స్మృతికోసం యిల్లా యెండబెట్టానే, ఆ నాకు తెలుస్తుంది. నాకు ముప్ఫైయేండ్లుకాలేదు. ముప్ఫైగడియలు కాలేదు. అదిగో! నా యెదుట వుంది. అదగో నన్ను పిలుస్తోంది. దానిమాట నాకు వినబడుతోంది.

బు : సరేనయ్యా! వసుధని కొంచెం కోపట్టానికి నీ యీ గోలకు ఏమి సంబంధం?

భ : పసిపిల్ల కన్నీళ్లుపెట్టుకుంటుంది.

బు : కొంచెం కోపంచెయ్యవయ్యా బాబూ!

భ : అది తల్లిలేని పిల్లోయి బాబూ! నేను దాన్ని ఏడిపించలేను. క్షమించు. [ తెర ]

# ప్రైవేటు పిల్ల

## పంచమాంకము

[కళ్యాణి యిల్లు—సంగం—ప్రవేశము—కూర్చుండి సిగరెట్టు త్రాగుచు]

వసుధ: (ప్రవేశించి) నాయుడుగా రున్నారా అండి.

సం : ఆ! ఏమి టంటారు.

వ : నాయుడుగారండీ! ఇంట్లో వున్నారా?

సం : నాయుడుగారా అండి. ఉన్నారేమో! ఎవరండి మీరు?

వ : వారితో పనివుండి వచ్చాను.

సం : ఇక్కడ కూర్చుంటారా! చూచి వస్తాను.

వ : (కూర్చుండును.)

సం : ఎక్కడికో వెళ్ళారల్లే వుందండి. అయినా చూసివస్తాను.

రె : (ప్రవేశించి) నాయుడుగారికోసమా అండి?

వ : అవును.

రె : మీ దీవూరేనా?

వ : ఊఁ.

రె : మీ పేరండి?

వ : వసుంధర.

రె : వసుధ అనికూడా అంటారా అండి?

వ : అంటారుకాని, మా నాయనగారు పెట్టినపేరు వసుంధరే.

రె : అవునండి, కొందరికి రెండుపేర్లుంటయ్యండి. సత్యభామకీ సాత్రాజితి అని, సత్యభామ అని రెండుపేర్లు. నాయుడుగా రింట్లో లేరనుకొంటాను. ఇప్పుడే వస్తాను పదండి అని వెళ్లారు.

వ : ఇంట్లో వున్నారేమో చూచివస్తానని వెళ్ళాడే!

రె : ఎవరు? ఆయనా! ఆయన అంతేలెండి.

సం : (ప్రవేశించి) యాక్టరుగారు వచ్చారే.

రె : మీ విషయం నాయుడుగారు చెపుతూవుంటారండీ మీరు. చాలా చదువుకున్నారట. మంచి రసజ్ఞత వుందట.

వ : ఆయన సుమారు ఎంతసేపట్లో రావచ్చును?

సం : వా రెక్కడికో వెళ్ళారట.

రె : (నవ్వి) పదినిమిషాలల్లో రావచ్చును.

వ : అయితే వెళ్ళి మళ్ళీ తిరిగివస్తా.

సం : ఎందుకండీ. ఈలోపుగా ఈ పేపరు చూస్తూవుండవచ్చును. పనియేమిటండీ?

రె : ఈపాటికి వస్తూవుంటారేమో కూడాను.

సం : మీరు ఇన్స్యూరెన్సు ఏజంట్లా అండి?

వ : కాదు.

సం : వారు చాలా గొప్ప యాక్టర్లండి.

రె : యాక్టరు అంటే దొంగకాదు. మెస్మరిజమ్‌చేయటం కాదు. నా సంగతి నీ కెందుకయ్యా!

సం : నీసంగతి నా కెందుకు? (వసుధతో) పైన నాయుడుగారి భార్య వుంది. పైకి వెళతారా అండి?

వ : ఇక్కడే వుంటా.

సం : నేను సిగరెట్టు త్రాగవచ్చునుకదండి. పొగ మీకు పడదేమో అని అడుగుతున్నాను.

వ : నేను దూరంగానే వున్నాను కదండి.

రెనడే :

మీరజాలగలడా నా యానతి
వ్రతవిధానమహిమన్ సత్యాపతి మీరజా॥
మధురమధురగానరసాస్వాదన
మధుర సుధారస మది నే కోరగ మీరజాలగలడా॥

సం : కాలమహాత్యం. కృష్ణమూర్తి సత్యభామ అవుతాడు. సత్యభామ కృష్ణుడు అవుతుంది.

రె : రాత్రి నీకూ నాకూ అయింది. మళ్లా నా జోక్యం ఎందుకయ్యా కలిపించుకుంటావు. నిన్నెక్కడో విచిత్రమైన మనిషిని తెచ్చాడే నాయుడుగారు.

సం : నాయుడుగారదేమిటో ఎవరిని తెచ్చినా అట్లాంటివాళ్ళనే తెస్తాడు.

వ : (లేచి వెళ్ళబోవును)

సం : మిమ్మల్ని అన్నాననుకుంటున్నారా యేమండోయ్, కూర్చోండి. నాయుడుగారు వస్తున్నారేమో!

వ : (కూర్చుండును)

రెనడే:

అవినెమొక్కను నేను రాధాక్షి నాదు
పైకి నెగబ్రాకు తామలపాకు తీగ.

సం : (చప్పట్లుకొట్టి) ఒప్పుమోరు.

రె : మనిషయినవాడి కొకసారి చెప్పితే తెలుస్తుంది.

సం : నేను మనిషిని కాలేదు. మనిషినే. కొందరు మనుష్యులవుతారు.

రె : అంటే.

సం : అంటేనా! అసలు సహజంగా యెద్దుమొద్దుస్వరూపంగాడనుకో. వాడికి కర్మంచాలక యేదో అదృష్టం పడుతుంది. వాడు మనిషయినవాడు.

రె : అంటే?

సం : అంటే ఇంకానా! సహజంగా శక్తిలేకుండా వాళ్ళని వీళ్ళని ఆశ్రయించి ఉద్యోగం తెచ్చుకొని బడాయిపోయేవాడు. ఆకంపెనీకి ఈకంపెనీకి ఏజంట్లుచేసి డబ్బుసంపాదించి పెద్దమనిషల్లే తిరిగేవాడు. యేదో వెధవసంగీతం నేర్చి చదువుకోని వాళ్ళని ఆకర్షించి నటుడైనవాడు. ఇట్లాంటి వాళ్లు మనుష్యులయినవాళ్ళు. యింకా కావలిస్తే మనో వృత్తివాళ్లు. అంటే తండ్రులు సంపాదించిన ఆస్తి వుంటుంది. వీడో పెద్దమనిషి. అన్నికమిటీలలోను వీడే. అల్లాంటి వాళ్ళు.

రె : ఇది నాయుడుగారి యిల్లుకనుక సరిపోయింది,

సం : మనమే కాదు. ఇంకాఎంతమంది వచ్చినా సరిపోతుంది. పెద్దయిల్లు కాదటండీ. ఇంకా సరిపోకపోతే పైన మేడుంది.

రె : (లేచి) నీవు పెద్దమనిషివి కాదు. నీతో మాట్లాడితే నాకు మర్యాదా భంగం కూడాను. ఛీ! ఛీ! (పోబోవును)

రా : (ప్రవేశించి) ఎక్కడికి వెళ్ళుతున్నారు. ఉండండి. నాయు
డుగారు వస్తున్నారు. (వసుధను చూచి) ఓహో: ఎప్పుడు
వచ్చారేమిటి. నమస్కారం.

వ : పదినిమిషాలయిందండి. తమరిక్కడే వున్నారా!

రా : ఇంకా నాలుగైదురోజు లుంటానండి. నాయుడుగారు
పోనీయండే.

వ : మీవంటి సత్పురుషులను నాయుడుగారు వెళ్ళనిస్తారండీ.
సత్పురుషులకు సత్పురుషులతో సహవాసం ఏదో పుణ్యం
చేతగాని కలగదట.

రా : నేను మహాపాపినండి. నేను సత్పురుషుణ్ణా అండి.

వ : కాకపోతే అల్లా అనరు.

సం : అల్లా యిద్దరూ అంటారండి. పాపీ అంటాడు సత్పురు
షుడూ అంటాడు. కాని కవిగారు సత్పురుషులేనండి.

రె : ఈయనకు నోరు మాట్లాడుతోంటే నొస వెక్కిరిస్తుంది.
ఒక్కొక్కడి జన్మ అంతే.

సం : ఛీ! ఛీ! అంతే!

రె : (నవ్వి) ఇల్లాంటివాడితో పోట్లాడీ లాభంలేదు.

సం : ఇంకో అట్లాంటివాళ్ళతో స్నేహంచేసీ లాభంలేదు.

రె : ఎందుకు లాభంలేదు. ఎంతమందికి ఫ్రీగా బెనిఫిట్‌గా
నాటకాలాడానుకాదు. కావలిస్తే నీకుకూడా ఆడిపెడతాను.

సం : ఇదివరకు మీ రొక్క యాక్టర్లే అనుకున్నా. ఉదారులు
కూడాను. విరాళాల చిట్టాలో మహాదాతల పేర్లపక్కనే
మీ పేరుకూడా పడాలికాబోలు.

సె : దురర్థాలు తీసేందుకు మగాడండీ యీయన. నేను వెళ్తా.

సం : ఏమివచ్చివెళ్ళినట్లు. రాధాకృష్ణగారు. వీరు ఒక కీర్తన పాడారు ఎంత బాగుందని. కావలిస్తే వారినికూడా అడగండి. ఏమండీ! ఏదీ. 'మీరజాలగలడా!' ఏదీ!

సె : బాబోయి! నీకు వెయ్యిదండాలు. నన్నేడిపించకు. వస్తానండి రాధాకృష్ణగారూ. [నిష్క్రమణ]

రా : నాయుడుగారు చాలా ఆలస్యంచేశారే!

క : (ప్రవేశించి) (వసుమతింక ఆశ్చర్యపోయి చూచును.)

రా : (ప్రొఫెసరుతో) మాటండీ! మీతో రహస్యం మాట్లాడాలి. వస్తారా! [రాధ-సంగం నిష్క్రమింతురు]

క : (జేబులోనుంచి డబ్బుతీసి వసుమతికిచ్చి పోబోవును.)

వ : బిచ్చపువాళ్ళమీద అంతకోప మెందుకు.

క : లోకమందరూ బిచ్చగాళ్ళే. ఒకళ్లు ధనాన్ని బిచ్చమడుగుతారు. మరొకళ్లు మరొకటి అడుగుతారు.

వ : ధనాన్ని యాచించడం లోకయాత్రకోసం. ధనంలేకండా ప్రాణాలు శరీరంలో నిలవవు

క : మరొకళ్ళకు మరొకటికూడా అంతది.

వ : క్షమించాలి అన్నంలేకుండా శరీరం నిలవదు. అది శరీర లక్షణం. ఇంకేదన్నా లేకండా శరీరం నిలవలేకపోతే అది శరీరలక్షణం కాదు. అది శరీరంమీదికి తెచ్చిపెట్టుకొన్న మనోలక్షణం కావచ్చు. ఆత్మలక్షణం కావచ్చు. ఆమనస్సుని ఆత్మని ఒద్దికలో పెట్టితే సరిపోతుంది.

క : మీ రిచ్చిన సలహాకి ఫీజు ముట్టిందిగా, వెళ్ళండి.

వ : మీరన్న యీమాట తగినదన్ని ముఖ్యాయిగా రామబాణా లన్నా ని అయించుకొంటాను. మీదగ్గిర డబ్బు తీసు కోటానికి నా కధికారంలేదని నాకు తెలుసు. కాని తీను కోక నాకు తప్పటంలేదు. ఇందుకోసం నే నెంత కృతజ్ఞు రాలనో భగవంతుడికి తెలుసు.

క : మీ రూరకే వేదాంతం చెప్తారేంటే అన్నా. క్షమించండి.

వ : పదేళ్ళమట్టి రానిది మీ యింటి కెంత యిబ్బందిగావుంటే వచ్చానని మీ వుద్దేశం?

క : దానికి నేను కృతజ్ఞుణ్ణి. ఏమిలాభం. నాకు కవిత్వమన్నా రాదు.

వ : వస్తే ఏంచేస్తారు?

క : యివ్వాళటి నా భాగ్యాన్ని నేను పాడుకుంటాను.

వ : ఈ శరీరంతో నే నింకోడి భార్యను. అందుచేత మీకు నమస్కారం చెయ్యటానికి వీలులేదు.

క : వాడు చచ్చి యెన్ని ఏళ్ళయింది.

వ : ఇరవై యేళ్ళు.

క : అప్పటికి మీ కెన్నేళ్లు.

వ : పన్నెండు.

క : అతనికి మీరు భార్యలు. బాగుంది. మీరు భార్యలని మీకు తెలుసునా అప్పటికి?

వ ఈ యిల్లు మీది. మీదాననని యీ యింటికి తెలుసునా?

క : ఇల్లు జడపదార్థం.

ప : జడమా, ప్రాణియా యని కాదు. ఎవరికేది చెందివుందని ప్రశ్న.

క : మనుష్యులకి మనస్సు వుంది. మనిషి బజారు వస్తువు కాదు. ఇష్టం వచ్చేట్లు వాడుకునేందుకు?

- : మనస్సు కష్టసుఖాలు అనుభవించేందుకు. అధికారం చేసేందుకు కాదు. ఆ అధికారంచేసేవాడు వేరే వున్నాడు.

క : మీకు చిన్నతనంలో భర్త పోయినాడే. మీజీవితం అంతా వ్యర్థం అయిపోవటంలేదా? ఇదంతా మీ మతం చేసిన ద్రోహం కాదా! ఇల్లాంటి ద్రోహానికి యెదురుతిరిగితే ఆ యెవ్వడో వున్నాడంటిరే అధికారి. వాడికెదురు తిరగటం కాదు: ఇది వాడికిష్టమే.

ప : సరే భర్త పోయినాడు. ఎదురుతిరుగుతాను. నాకు చిన్నతనంలో మశూచికం వచ్చి కళ్ళుపోయినవి అనుకోండి. అది యెవరు చేసినద్రోహం. యెవరిమీద యెదురుతిరగను.

క : అది దైవికం.

ప : దైవికమేమి! ఆ అంటువ్యాధి రాకుండా చేసే మార్గాలు లేవా! ఆరోగ్యకరమైన నీళ్ళు, ఆహారం కలిగివుంటే పట్టణంలో ఆరోగ్యం సరిగాచూసే వైద్యులు శ్రద్ధగావుంటే అల్లాంటి ఆపద రాకపోవచ్చు.

క : గాలిని నీటినికూడ అధికారంలో పెట్టాలి. అంతశక్తి మనకు లేదు, అది మనుష్యుడి శక్తి దాటిపోయినవిషయం, అందులో సూక్ష్మవిషయాలు చాలా వున్నవి

ఏ : ఇందులో లేవా! ఎక్కడావున్నవి. కొన్ని మనచేతిలోవి వలె కనపడతవి.

క : ఇష్టంలేదు అన్న ఒక్కమాటతో తేలిపోయేదానికి యింత వాదోపవాద మెందుకు?

వ : నాకిష్టంవుంది.

క : మరి లేనిదెవరికి?

వ : నా శరీరానికి.

క : ఈ శరీర మెవరిదేమి?

వ : అచ్చంగా నాదికాదు. ఇష్టం అచ్చంగా నాది. ఈ శరీరం నాది, నా తండ్రిది, నా బంధువులది, నా కుమారుడిది, దీనిమీద అందరికీ తలాకాస్తా హక్కువుంది. వాళ్ళందరి హక్కులు నే నెట్లా అపహరిస్తాను.

క : ఇదంతా బానిసబుద్ధికి లక్షణం.

వ : ప్రతి బుద్ధీ ఏదోఒక సాంప్రదాయానికి బానిస.

క : సరే యింక పదండి. ఇంతసేపుంటే ఎవ్వరయినా ఏమన్నా అనుకొంటారు.

వ : అనుకొనేది యివ్వాళ కొత్తగా అనుకోరు.

క : ఆ మాటలో మళ్ళీ నా కాశ కలిగిస్తున్నారు.

వ : ఇంకోజన్మలో మీకు భార్యనై పుడతాను.

క : అప్పుడు నేను బ్రాహ్మణ్ణిఅయిపుట్టాలికాʼవలు!

వ : అక్కరలేదు. నేను దానికి పూర్వం ఎవరికీ దత్తనై యుండకూడదు.

క : అందుచేత యీ జన్మలో ఆ చచ్చిపోయినతనికి భార్య లన్నమాట మీరు.

వ : అవును.

క : ఆయితే తలవెంట్రుక లెందుకు తీయించుకోరు. విధవకి మల్లే ఎందుకుండరు. ఇది మీ యధికారంలేనిదాని కెదురు తిరగటంకాదా?

వ : నేను మనసా విధవరాలినే. ఇది భగవంతుణ్ణి ఎదిరించటంకాదు చాపల్యం ప్రదర్శించటం.

క : ఎందు కీ చాపల్యం?

వ : మీకు నా రూపం ఆనందహేతువుగా వుండాలని.

క : మీ తత్త్వం మీకే తెలియాలి. ఈ వస్తువు నాదికాదు. నాదల్లేనే వుంటుంది మళ్ళీ.

వ : స్నేహితునింట్లో వస్తువల్లే. మనకు దానిమీద ఆధికారం వున్నట్లేవుంటుంది. మళ్ళీ అది మనదికాదు. ఆది మనం వాడుకుంటే స్నేహితుడేమీ అనుకోడు. మనం వాడుకోము. ఆ మర్యాదా ఆల్లాగే అట్టిపెడతాము.

క : ఒకసారి మిమ్మల్ని నేను తాకకూడదూ!

చం : (ప్రవేశించి) ఉన్నవస్తువు ఉన్నచోట ఉండనివ్వరు. మా కన్న ఆడవాళ్లు బయలుదేరారు. వీళ్ళకు దువ్వెన్నలతో పని. (వెదకును.)

వ : తాకకూడదు, తెలిసిందా. శెలవు. [నిష్క్రమణ]

[చంద్రమతి దువ్వెనతో నిష్క్రమణ]

క : నెత్తురులో కులంలో ఒక సంవిధానంలో ఒక అల్పతర

విషయంలో భగవంతుడున్నాడనే వాళ్లే అధికులా! వసుంధరా! వసుంధరా! నీవు నా దగ్గరకే వచ్చావు. నేను నీ దగ్గరకు రాలేకపోయినాను. కాబోలు.

రా : (ప్రవేశించి)

ఓ ప్రణయశీల! నేను నిశాప్రశాంత
గాఢతమసాకృతిని నీవు కలలొదిగిన
చటుల సౌదామనీరేఖ విటుల నాదు
దివ్యసన్నిదికే దారితీసినావు.

క : ఏదీ: మళ్ళీ!

రా : (మరల చదువును)

క : మళ్ళీ! మళ్ళీ! ఎన్నివందల సార్లయినా సరే. నీవు నాదు దివ్యసన్నిధికే దారితీసినావు. కవీ! చూశారా! ఆ భాషమంతా ప్రత్యక్షరం నాదే. ఆ పద్యం నాది కాదు.

[తెర]

# తల్లి లేని పిల్ల

## షష్ఠాంకము

[రైలుదిగి దారిలో—కళింగరావు, రాజ్యం.]

కళి : కూలివెధవ ఎంత వెనకున్నాడో!

రాజ్య: వాడు మీ యిల్లు ఎరగడూ! అదేనా వూరు.

కళి : అదికాక యింకేదవుతుంది.

రాజ్య: స్టేషనుకి వూరికి దూరమే.

కళి : బండికట్టిద్దామా అంటే వద్దన్నావుగా.

రాజ్య: సరదాగా నడుద్దామని కాదూ? మనం ఇద్దరమూ కలసి నడుస్తోంటే సరదా! నన్ను మీ యింటికి రానిస్తారా!

కళి : మనం నాయుడు గారింటికి పోతాంగా. నాయుడుగారు చాలాసరదా అయిన మనిషి. కవిత్వాలంటే, నాటకాలంటే ఆయనికి చాలా యిష్టం. నా చదువుకి డబ్బిచ్చింది అంతా ఆయనేగా!

రాజ్య: ఇంత డబ్బిచ్చాడంటే మంచివాడన్నమాట.

కళి : మా 'మదరు' ఆయనా మారేజిచేసుకుంటారనుకొంటా.

రాజ్య: ఓహూ! అలా చెప్పు!

కళి : కాని మా యింట్లో Old Hag ఉన్నాడు. ఆతని మూలంగా వీలులేకుండావున్నది. ఆయన బి.సి.నాటివాడు.

రాజ్య: వాణ్ణి యింట్లో ఎందుకుంచారు?

కళి : ఊళ్ళో మనవంక, చూశావా, ఎట్లా చూస్తున్నారో.

రాజ్య: నాయుడుగారిల్లు ఇంకా ఎంత దూరంవుంది.

కళి : ఈ సందు మలుపు తిరగాలి. అదుగో! ఆ మేడ. నీవు ఈ వూళ్ళో వున్నంతసేపు నాతో చనువుగా వుండొద్దు. మనం పెళ్ళిచేసుకుంటా మన్నమాట ఎవరికి తెలియ కూడదు.

రాజ్య: వట్టి పిరికిలాగున్నావేం. ధైర్యం వుండాలి.

బుచ్చి: (ప్రవేశించి) ఏమిరోయి కళింగం, అమ్మవస్తావనుకొంటూ నేవుంది. ఈ అమ్మాయి యెవరు?

కళి : స్నేహితురాలు. డాక్టరుపరీక్ష చదువుతోంది .

బుచ్చి: ఎవరు? బ్రాహ్మలేనా?

కళి : కాదు. బ్రహ్మ సమాజంవారు.

బుచ్చి: యిల్లు వదలిపెట్టి యిట్లా యెక్కడికి?

కళి : నాయుడుగారింటికి, ఈ అమ్మాయి నాయుడుగారికి చుట్టం. ఈవెణ్ణి అక్కడ దిగబెట్టి వద్దామని.

రాజ్య: నే నాయన్ని ఎరుగనుకూడాను. ఆయన నాకు చుట్టం కాదు, ఏమికాదు.

బుచ్చి: నేనుకూడా వస్తానుపద, నాయుడింటికి.

కళిం : నీవెందుకు తాతయ్యా! నీవెళ్ళి అమ్మతో చెప్పు, నేను వస్తున్నానని.

బుచ్చి: నాయుడుగారితో నాకు పనుందిలే.

రాజ్యం: (విరగబడి నవ్వుతుంది)

కళిం : ఎందుకు పూలువలె నవ్వుతావు.

రాజ్యం: అవును. పూలు అయితే నువ్వుకావాలి, లేకపోతే నేను కావాలి. ఆయనమట్టుకు కాదు.

బుచ్చి: స్త్రీజాతిలో యిది క్రొత్తసృష్టే.

[తెర యెత్తగా—కళ్యాణి, సంగం, రాధ, రెనడే]

బుచ్చి: నాయుడుగారూ, చుట్టాలు వచ్చారండి.

కళ్యా: రండి! రండి! ఓ! కళింగం ఈవిడ ఎవరు?

బుచ్చి: నాయుడుగారేమో మంచివారనుకొన్నా. చుట్టాలనికూడా మరచిపోతారేమీరు.

రాజ్యం: (విరగబడి నవ్వును) నేనూ కళింగం స్నేహితులం. ఆతను బి. ఏ. ప్యాసవటంతోనే మే మిద్దరం పెళ్ళిచేసుకొంటాం.

బుచ్చి: బాగుంది.

కళిం : ఆవిడ ఎప్పుడూ అల్లాగే మాట్లాడుతుంది.

నా : కూర్చోండి. (అందరూ కూర్చుంటారు).

కళ్యా: ఆయనే కళింగరావు వసుంధరమ్మగారి కొడుకు. ఈయన ప్రొఫెసరు సంగం అని మెస్మరిస్టు. వీ రిద్దరినీ నీవు చూసేవుంటావు. ఆయన మహాకవి. ఈయన మాస్టరు రెనడే.

కళి : గుడ్‌మార్నింగు. (అందరికీ షేక్‌హాండులిచ్చి) ఈవిడ నా క్లామేటు. పేరు కాంచన, నేను మాత్రం నా రాజ్యం అని పిలుస్తాను. అంతేకాదు రాజ్యం.

రాజ్య: (నవ్వి—అందరికీ షేక్‌హాండు ఇస్తుంది.)

[సంగం షేక్‌హేండు ఖుస్తూ చెయ్యి నెమ్మదిగా లాగుతాడు.

రెనడే మొగం వాలుస్తాడు. రాధ నవ్వుతూ ఆవిడవంకచూస్తాడు. రాజ్యం సంగం లాగితే హా అని కేకవేస్తుంది. రాధకు మళ్ళీ నవ్వువస్తుంది.]

సం : వారి కివ్వాక్కర్లేదా షేక్‌హాండు.

బుచ్చి: నేను మళ్ళీ స్నానంచెయ్యలేను. కొత్తజంధ్యాలు లేవు. ఎందుకుచంపుతారు?

కళ్యా : (నవ్వుతూ) ముట్టుకుంటేనే స్నానం చెయ్యాలాఅండి.

బుచ్చి: నాకు షేక్‌హాండు ఎందుకు? నాకేం ఇంగ్లీషువచ్చా. పాడువచ్చా! పైగా షేక్‌హాండిస్తే లాగాలో నవ్వాలో ఏమీ తెలియదాయె నాకు. ఎందుకులెండి.

కళిం : (బుచ్చిమామవంక కోపంగా చూస్తాడు).

రాజ్య: ఇంగ్లీషురాని బూర్సు ఇంతే.

బుచ్చి: ఏమన్నా తిట్టా ఏమిటండి. నాయుడుగారూ, అది?

కళ్యా: ఎబ్బే, కాదండి.

బుచ్చి: నీకు కోపంఎందుకమ్మా! నాయుడూ, నీవు చెప్పవయ్యా. ఆవిడ ఏకులమో తెలియదాయెను! మాలదియేమో!

సం : బాబూ! మీకు ఇష్టంలేకపోతే వెళ్ళండి ఎందుకు వృధాగా మా అందరకు కష్టం కలిగిస్తారు.

రాజ్య: వీళ్ళకు కులం, వర్ణమేతప్ప మనుష్యులన్నమాటే లేదు. పదిమందిలో మర్యాదన్నా తెలియదు.

బుచ్చి: మీకు కులభేధం, స్త్రీ భేధం తెలియదు. కోపం ఎందుకు. నా మూలంగా మీ కెన్నో అభ్యంతరాలు వుంటయి. నేను వెళతాను. [నిష్క్రమణ]

రె : నాకు పనివుంది, శెలవు. [నిష్క్రమణ]

నాయుడు: కాఫీ అయిందా!

రాజ్య: అయిందండి. అదేపో స్టేషనులో చేశాం.

నా : కళింగంఇంటికి వెళతావా?

సం : ఈయనవెళ్ళి పుల్రేపులు పెట్టడు అక్కడ.

కళి : నేను వెళతాగాని రాజ్యం ఇక్కడే వుంటుంది.

క : అక్కడికెడితే మీ తాతయ్య కర్రుచ్చుకుంటాడు.

కళి : రాజ్యం ఒంటిగంటకుగాని భోంచెయ్యదు.

సం : ఇవ్వాళ ఏకాదశా!

రా : ఇప్పుడు బ్రెడ్ పుచ్చుకుంటారా!

సం : ఇవ్వాళ నేనూ అంతే.

క : ఎంచేత? మీరుకూడ దొరలపద్ధతేనా? అయితే నీవు వెళ్ళు కళింగం. మేము భోంచేస్తాం. మీరొక్కరూ ఇక్కడ వుంటారా!

రాజ్య: ప్రొఫెసరుగారు వుంటారన్నారుగా?

సం : నాకు కడుపులో జబ్బుగా వున్నది. చెప్పానుగా!

కళ్యా: అయితే బ్రెడ్ వస్తుంది. రాండి. రాధాకృష్ణగారూ! నాకు ఇవ్వాళ ఆకలి అవుతోంది.

[రాధా—కళ్యాణి నిష్క్రమణ]

సం : మీరు స్నానము చేయ్యరూ!

రాజ్య: రాత్రికేనండి.

సం : మీరు డాక్టరు పరీక్ష యెన్నో యేడు.

రాజ్య: మూడవ యేడు.

సం : మీకు కళింగరావుగారికి ఎట్లా కలిసింది.

రాజ్య: మా యింటి ప్రక్కనే ఒక గదిలో అతనుంటున్నాడు. మీదే వూరండి? ఈ వూరేనా!

సం : కాదు. నాయుడుగారి భార్యకు జబ్బుగా వుంటే నయంచేయటానికి వచ్చాను.

రాజ్య: మీరు వైద్యంకూడా చేస్తారా!

సం : ఇది దేహ సంబంధమైన రోగం కాదు: మనస్సంబంధమైంది. దానిని నేను ఆత్మశక్తితో కుదురుస్తాను.

రాజ్య: ఎల్లాగండీ?

సం : మా గురువును తలుచుకొని నాలోవున్న ఆత్మ బలాన్ని ఆవిడమీద ప్రవహింపచేసి ఆవిడ మనస్సు నేను చెప్పినట్లు వినేట్టుచేస్తా. అది యోగశక్తి అంటారు.

రాజ్య: అల్లా ఎవరినిపడితే వాళ్ళని చేస్తారా? ఇపుడు నన్ను చేస్తారా?

సం : ఊరికే ఎందుకు? ఏదన్నా ప్రయోజనం వుండాలి.

[బంట్రోతు బ్రెడ్ తెస్తాడు. వెళతాడు.]

[ఇద్దరూ చేతులు కడుగుకొని బల్లమీద ఆరగిస్తారు]

సం : మీకింకా కొంచెం బట్టరు కావాలా?

రాజ్య: ఆ చంచా యివ్వండి. నేను తీసుకుంటా.

[సంగం యిస్తూ చేయిచేయి తాకిస్తాడు]

రాజ్య: నాయుడుగారి కేమాత్రం ఆస్తి వుందండి.

సం : ఒక లక్షరూపాయలున్నవని చెప్పుకుంటారు.

రాజ్య: ఆయన భార్యకేమిటి జబ్బు?

సం : (నవ్వి) ఏమీలేదు.

రాజ్య: ఏదోవుంది. చెప్పాలి.

సం . కొందరు దేవతాప్రకృతులుంటారు. వాళ్ళల్లో ప్రేమ అఖండంగా వుంటుంది. కొందరు వట్టి కట్టెలు. వాళ్లే నీతి గీతి అని దేవులాడేది.

రాజ్య: ఆవిడకి నాయుడుగారి మీద యిష్టంలేదా! అయితే ఇంకోళ్ళని చేసుకొనేది.

సం : మనిషి స్త్రీ అయితే యేం, పురుషుడైతే యేం అనుభవించే శక్తిగలవ్యక్తి. లోకం అనుభవానికైన విషయం. అనుభవంలో ఆనందం వుంది. మనకున్నశక్తిని ఉపయోగిస్తే దానికి ఫలితం కనపడుతుంది. క్రైస్తవ మతంలో దేవుడు చచ్చిపోయి స్వర్గానికి వెళ్ళినవాణ్ణి అడుగుతాట్ట: 'నేను నీ కిచ్చిన శక్తిని వృద్ధి చేశావా, నాశనం చేశావా' అని. వృద్ధిచేసినవాడు దేవునికి నచ్చినవాడు. ఈ తత్వం ఆ మతాలకి తెలిసినట్లు మనమతానికి తెలియదు. మనవాళ్ళు వట్టి లోభిముండాకొడుకులండి, యెందులో చూచినా సరే.

రాజ్య: మా కళింగంకూడా మంచి నూతనాభిప్రాయాలు కలవాడండి.

సం : ఏమి నూతనమండి చూడండి. ఇంటికివచ్చాడా! ఇదిగో తల్లీ తాతా ముక్కుత్రాళ్ళు బిగిస్తారు. దానితో గొడ్డు చచ్చిందన్నమాటే.

రాజ్య: అతను చాలా స్వతంత్రుడు. ధైర్యంకలవాడు చూడండి. నన్నిక్కడికి ధైర్యంలేకపోతే తెస్తాడా!

సం : అది మీధైర్యం. మీకేమండి, చదువుకున్నారు. కాఫీ యింకొంచెం పొయ్యనా—మీ యిష్టం మీది. కళింగం కాకపోతే I. C. S. ఫ్యాసయినవాడు వస్తాడు.

[రాజ్యం చెంచా క్రిందపడితే తీసి యిస్తాడు.]

రాజ్య: థాంక్సు. మీ చెయ్యిచల్లగా వుందే?

సం : అన్నమేది అసలు, పచ్చడిగా వుంటానికిగాని, చల్లగా వుంటానికి గాని.

రాజ్య: దీన్ని ఇంగ్లీషులో పన్నింగు అంటారు. నాకు అదంటే అసహ్యము.

సం : బాగా పరిపక్వమైన బుద్ధికలవాళ్ళకి అంతే. ఈ కవి, యీ యాక్టరు వున్నారే. వాళ్లు కొంచెం తక్కువచదువు కొన్నవాళ్లు. వాళ్లు యిట్లా మాట్లాడితే చాలాసంతోషిస్తారు. (రాజ్యం సిగరెట్టు నోటపెట్టుకొనును. సంగం నిప్పుపుల్ల గీసి ముట్టిస్తూ)

సం : ఇది మిలిటరీవాళ్ళకి మహాప్రమాదం, మీసాల కంటుకో వచ్చు.

రాజ్య: మీసాలు చూస్తే నాకు ఒళ్ళు తగలడుతుంది.

సం : మీ ఒళ్ళు తగలట్టం ఎందుకు? వాళ్ళ మీసాలే తగలడ నివ్వండి. మీ బుగ్గమీద బట్టరు కాఁవలు అంటింది.

[తాను చేతితో దుడుచును.]

రాజ్య: థాంక్సు.

[సేవకుడువచ్చి గిన్నెలు తీసివేయును]

సం : నాయుడుగారి భోజనం అయిందా?

[సేవకుడు నిష్క్రమించును]

రాజ్య: నా సిగరెట్టు ఆరిపోయింది.

సం : నిప్పుపుల్ల ఒక్కటేవుంది. అది అయిపోయింది. ఇం దండి వెలిగిస్తాను. మావేపున చుట్టలు ముట్టిస్తారు. అల్లా చూపించమంటారా!

[సిగరెట్టు ఇద్దరినోళ్ళలో వుంచుకొని వెలిగించి]

రాజ్య: ఇది నాస్టీ హాబిట్.

సం : నోటికి నోటికి రెండుసిగరెట్లంత దూరం వుండగానే నిజంగా అసహ్యమే. పల్లెటూరివాళ్ళు చేసుకొనేది. మీకే మన్నా వక్కపొడి అలవాటాఅండి?

రాజ్య: వక్కపొడి దొరలు తినరు.

సం : దొరసానులు తినటానికేం?

రాజ్య: మీరు నన్ను పొగుడుతున్నందుకు కృతజ్ఞురాలను. మీరు మధురంగా మాట్లాడుతారు.

సం : మీవంటివారు అల్లాఅంటే చాలు. ఇల్లా చాలామంది అన్నారు. మీ రిక్కడ యెన్నాళ్లు వుంటారు.

రాజ్య: పదిరోజులన్నా వుంటామనుకొంటాను. ఈవూరుపొలాల మీదిగాలి పీల్చాలి. పల్లెటూళ్ళు చాలా ఆనందంగావుంటా యండి. పచ్చికబయళ్లు, పచ్చని చేలు!

సం : మీకు కొండలంటే యిష్టమా అండి?

రాజ్య: చాలాయిష్టం. అవి అంటే పడిచచ్చిపోతా.

సం : ఇక్కడికి దగ్గరలో ఒక కొండ వుందండి. దానిమీద దొనలున్నవి. చాలా అందమైన ప్రదేశం, ఒకరోజున అక్కడికి వెళదామా!

రాజ్య: మా కళింగంకూడ కూడా వస్తాడు.

సం : ఇద్దరికన్న ఎక్కువైతే కంపెనీ బాగుండదు.

రాజ్య: మరి అతను రాకుండా ఎట్లా? అతను వస్తానంటాడే? రెండుమూడు రోజుల్లో వాళ్ళతండ్రి తద్దినంట. ఆరోజున నన్ను వదలిపెట్టాలిసొస్తుందేమో అన్నాడు.

సం : సరిపోయింది. ఆనాడు మనం వెళితేసరి. కొండ చాలా బాగుంటుందిలెండి.

కళ్యా: (ప్రవేశించి) అయిందా?

రాధ : (ప్రవేశించును)

[తెర]

# తల్లి లేని పిల్ల
## సప్తమాంకము

[ప్రదేశము—నాయుడి యిల్లు. రాధ, కళింగం, రాజ్యం, కళ్యాణి]

రాజ్య: ఇవ్వాళ సంగంగారు కనిపించలేదే?

నా : మేడమీద వున్నారు. మావాళ్ళకు వైద్యంచేస్తున్నారు.

కళి : మీ సలహా ఏమిటి?

నా : ఏం చెప్పమంటావు? ఇందులో నా సలహాకన్న మీ తాత గార్ల సలహాయే మంచిది.

రా : తప్పుచేశాననిపోయి పోలేసుస్టేషనులో చెప్పినట్లే. వెంటనే లాకప్పులో పెడతారు,

కళి : బ్రాహ్మలెవరూ రామంటున్నారు. మా అమ్మ నన్ను చంపేస్తోంది. నాకు రాజ్యం ఎక్కువా. ఈ తద్దినాలెక్కువా!

రా : ఈ తద్దినాలంతా నాన్సెన్సు. చచ్చినవాళ్ళని మనం చూడొచ్చామా! మనం యిచ్చింది వాళ్ళకి అందుతుందని నమ్మకమేమిటి? ఇదంతా బ్రాహ్మల్ని మేపటం. ఈ బ్రాహ్మలంతాచేసిన దుర్మార్గం ఏదోరూపేణా వాళ్ళకి ముట్టాలి, లేకపోతే మనం తరించము.

కళి : వట్టి సూపర్‌స్టిషన్. నా కిష్టంలేదు తద్దినాలుపెట్టటం గోడమీద పిల్లివాటం. నాయుడుగారెటూ మాట్లాడరు.

నా : వస్తా (నిష్క్రమణ)
రా : నా వుద్దేశం చెప్పమంటారా!
కళి : చెప్పండి.
రా : మొదటిపక్షం మానెయ్యండి. ఈ బ్రాహ్మల్ని ఏంచేస్తారో చేయనియ్యండి. రెండోపక్షం మీవాళ్ళ యిబ్బందిపడలేక పెట్టారా! నన్ను, ప్రొఫెసరు సంగంగార్ని భోక్తలుగా పెట్టి పెట్టండి. బ్రాహ్మలు రామంటే ఏంచేస్తారు?
రాజ్య: నేనూ, సంగంగారూ రేపు కొండ కెళదా మనుకొంటు న్నామే.
రా : ఎల్లుండి అందరం కలిసిపోదాం.
నా : (ప్రవేశించి) బుచ్చిమామగారు వస్తున్నారల్లేవుంది. మేడ మీదనుంచి చూస్తే వస్తున్నాడు. ఈ మలుపు తిరిగాడు.
బుచ్చి: (ప్రవేశించి, వచ్చి కూర్చుండును.)
నా : ఏదండీ, రాధాకృష్ణగారూ, మొన్నటి పద్యాలు చదవండి! బుచ్చయ్యగారు వింటారు. వారు పండితులండోయి!
బుచ్చి: ఇప్పటి కవిత్వాలు నాకేం తెలుస్తాయి!
నా : అంతే! మీకు తెలియకేం! చదవండి.
రాధ : "వెలుగురాచిన"
[రాధ మొదలుపెట్టటంతోనే నాయుడు నిష్క్రమించును]
రాధ : (వెలుగురాచిన మొ. ౨ పద్యాలు చదువును),
కళిం : ఆహా! ఏమి వండర్‌ఫుల్‌గా వున్నయ్యండి. నేను ముగ్ధ్ణోఅయిపోయినాను. యూ ఆర్ ది గ్రేటెస్టుపొయెట్.
రాజ్య: చాలా బాగుందండి. మీగొంతు ఎంతబాగుంది: కళింగం,

చూశావా! అడయార్లో మొన్న నెమిలిని చూశాం. కవి గారు 'వెలుగురాచిన' అన్నపుడు ఆ నెమిలి కూసిన ట్లుంది కాదూ?

నా : (ప్రవేశించి) చదివారా!

రాధ : ఆ!

నా : ఎల్లా వున్నయ్యండీ?

బుచ్చి: బాగానే వున్నయి.

నా : అల్లాకాదు. మీ అభిప్రాయం చెప్పండి.

బుచ్చి: నా కీ కవిత్వాలు ఏమితెలుస్తయి.

నా : అయితే బాగావున్నవని ఎందుకన్నారు.

బుచ్చి: మీరు పెద్దమనుష్యులు. మరి ఏమనను.

రాధ : కాదండి: ఎల్లావున్నయ్యో చెప్పండి. మీ అభిప్రాయం మీరు చెప్పండి. తప్పులుంటే దిద్దుకుంటాను.

బుచ్చి: మొదట అల్లాగే అంటారు. తరువాత కోపాలువస్తవి.

రా : నిజంగా కోపంరాదు.

బుచ్చి: నిజంగా కోపం రాదన్నా వస్తుంది. కోపం రాదనే స్థితి ఆత్మకి వుంటే రాదుకాని నోటితో అంటే ఆగదు.

కళ : మా తాతయ్య అంతే! అదంతా వేదాంతంలెండి.

క : అంత అడుగుతోంటే చెప్పరాదండీ

బుచ్చి: 'బీరనరాలు' అంటే ఏమిటండీ!

రా : బీరనరా లంటే? ఏవో అందంగా వుందని వేశాను.

బుచ్చి: అర్థం తెలియకండానే.

రా అప్పుడేదో చూసే వేళానండి. అదిరైతే (నాయుడు నిష్క్రమించును)

బుచ్చి: ఇలావుంటుంది. సరే చరమార్ధ గీతిక అంటే?

రా : అట్లా అడిగితే చెప్పడం కష్టమండీ! తప్పులుంటే చెప్పండి. కవి ఆవేశంలో సొగసైన మాట వేస్తాడు.

బుచ్చి: ఒళ్లు తెలియని పిచ్చి కూడదు. చరమార్ధం అంటే చివరి అర్ధం. దేనిచివర, జీవితం చివరా! అంటే చావు అది అశ్లీలం తరువాత "మెట్ల కిన్నెర తీగలు చిట్లిపోయె." తీగెలు తెగిపోతయి. చిట్లవు. అద్దం చిట్లుతుంది. తెగి పోవటానికీ చిట్లిపోవటానికీ భేదం వుందంటారా, లేదంటారా!

[నాయుడు ప్రవేశించును]

బుచ్చి: నాయుడుగారు క్షమించాలి. అడిగారు కనుక చెప్పాలి వొచ్చింది—చూడండి. మెట్లకిన్నెర తక్కువకులాలవాళ్లు వాయించుకొనే వాద్యం. మీరు దానిమీద ఎల్లా వాయిస్తారు. వీణ అనండి. వేణువనండి. బాగుంటుంది.

శశి : తక్కువకులాల వాళ్ళది కనుకనే దాన్ని తీనుకుంది. లైఫు వాళ్ళల్లో వుంది. మనలో ఏముంది.

నా : వారిని చెప్పనివ్వండి.

రాధ : మనకు బీదవాళ్ళతో సానుభూతి వుండాలికదండి!

బుచ్చి: సానుభూతివుంటే డబ్బివ్వండి. వాళ్ళ కష్టాలు తొలగించండి. వాళ్ళ అప్పులు తీర్చండి! కూటికీ గుడ్డకీ కొరత లేకండా చెయ్యండి. అంతేగాని సారస్వతంలో వాళ్ళ సంగతి వ్రాస్తేనే సానుభూతి వస్తుందా!

రాధ : ఇంకా రెండోపద్యం.

బుచ్చి: మళ్ళీ చదవండి.

రాధ : (చదువును)

బుచ్చి: సరే, మీరు తమసాకృతులు. అల్లా అనటంలో రసజ్ఞత్వం నాకు తెలియదు. 'కలలొదిగిన' ఏమిటి?

కళిం : (నవ్వి) కలలంటే డ్రీమ్సు. The flash of Lightning in a dream Some dreamy thoughts అన్న మాట. నీకు తెలియదులే. దాని కింగ్లీషు రావాలి.

బుచ్చి: అయితే తెలుగులో వ్రాయటం ఎందుకు?

రాధ : అదంతా తెలుగు చేస్తాం.

బుచ్చి: అప్పటికి అంతా ఇంగ్లీషు అయిపోతే తెలుస్తుంది.

నా : నాకు పనివుంది, వెళ్తాను. [నిష్క్రమణ]

బుచ్చి: కళింగం! బ్రాహ్మలమాట ఏమిచేశావు?

రాధ : ఎవరూ రానంటే ఆయన్నేం చెయ్యమంటారూ?

బుచ్చి: అయ్యో! వస్తూనే ఈ అమ్మాయిని పెళ్లిచేసుకుంటానని టమటమా కొట్టాడాయె. మరి బ్రాహ్మ లేలా వస్తారు?

కళిం : టమటమా కొట్టింది నువ్వా, నేనా!

బుచ్చి: ఈపిల్లని తేవటమే కొట్టటం.

కళి : నీవు నాతో మాట్లాడొద్దు. వెళ్ళిపో.

బుచ్చి: నా కెందుకు లేరా నాయనా! అమ్మ పిలుస్తోంది. వస్తావా!

కళి : నేను రానుపో!

బుచ్చి: సరే; అమ్మ పిలవమంది. అందుకని వచ్చాను. నాకేం.

[నిష్క్రమణ]

రా : వెళ్ళిరండి.

కళి : [నిష్క్రమించును]

రాజ్య: నేను పొరపాటు చేశా. ఇక్కడికి రావలసింది కాదు.

రా : ఇది మీ కెట్లా తెలుస్తుంది. కళింగం చెప్పాలిశింది.

రాజ్య: పూర్ బర్డ్. ఆతనికి మేమిద్దరం సరదాగా రావటమే తెలిసింది. ఇంకోటి తెలియలా.

రా : మీరు ఇల్లాంటి ఇబ్బందులు లేనిచోటే వెళ్ళిచేసుకో రాదూ.

రాజ్య: అంటే మిమ్మల్ని చేసుకోమనా!

రా : నే నసలు పెళ్ళిచేసుకోను. మాది ఫ్రీలవ్ థియరీ.

రాజ్య: అయితే నన్నందులో చేరమంటారా!

రా : మాకు పెళ్ళిచేసుకున్నా యిబ్బందిలేదు.

రాజ్య: మీ సిద్ధాంతాలు మీ హొయట్రీలో లేవే!

రా : మీరేమూల విన్నారు? ఇప్పుడు సగం వుంటే ఏమంటాడో తెలుసునా! ఏమూలా అంటే, ఆగ్నేయమూలా, వాయవమూలా అంటాడు. ఆయన విట్ అంతే.

సం : (ప్రవేశించి) లెండి: వెళుతున్నాం! మీరు లేస్తున్నారు! అదుగో! బయటకి వెళ్ళాం! వెళ్ళాం! మీరు లేచారు.

క : (ప్రవేశించును) (సంగం-రాధ-రాజ్యం సమ్మోహితులై నిష్క్రమింతురు )

క : నేను ధర్మమైన పనిచేస్తున్నాను. కాని మనస్సులో అనుమానం తెగలేదు. ఆత్మ ఒకరిది. శరీరం ఒకరిది. ఏమి యీ సంయోగంలేకపోతే? వసుధ నన్నంత ప్రేమిస్తోంది-కాని మా యిద్దరి శరీరసంయోగం ఆమెకు అక్కర

లేదట. ఆదేవాతామూర్తి ఆ ధార్మాన్ని నే నెందుకు స్వీకరించరాదు? ఈ పాటికి బయలుదేరివుంటుందా! మెట్లు దిగి వస్తోంది. ఇంతా ప్రయత్నంచేసి యిప్పుడు విరాగ మెందుకు? ఆహా! నన్ను అందరూ మంచివాడంటారే? అందరూ ప్రేమిస్తారే! నా భార్య నన్నెందుకు ప్రేమించ రాదు. ఒక్కొక్కడిజన్మ చమత్కారం. అన్నీ వున్నవి. నాకు స్త్రీసౌఖ్యం లేకపోయింది. అంత ప్రేమిస్తూన్న వసుధవల్లనే లేకపోతే యితరత్రా చెప్పాలా? ఇంకా రాలేదేమి? ఇం దాకే మెట్లుదిగుతున్నట్టు వినిపించిందే. ఆవిదేవస్తుంది, మీరటుతిరిగి చూడవద్దన్నాడు సంగం. ఆవిదేవచ్చి పలక రించాలట సరే! కానియ్యి నాభార్య నన్నెందుకు ప్రేమిం చకపోవాలి. నేను ముసలివాడనా! నలభై యేండ్లు దాట లేదు. కురూపినా! చాలామంది స్నేహితులు కాదంటారు. పెద్ద అందగాణ్ణి కాకపోయినా కుంటివాణ్ణి కాదు. గుడ్డి వాణ్ణి కాదు. ధనమెంతో దేవుడిచ్చింది వుంది. లోకంలో ఒకానొక స్త్రీ పురుషులసంబంధంచూస్తే ఆశ్చర్యం అవు తుంది. పరమ నీచకులంవాడు. పరమ వికారి. నిర్ధనుడు. మనిషి అసహ్యంగా వుంటాడు. స్త్రీమనస్సు వానిమీదికి పోతుంది. ఎవడు చెపుతాడు? పూర్వజన్మలో చేసుకుంటే గాని యేదీ లభించదు. వట్టి బుద్ధిలేనివాణ్ణి, పరమలోభిని లక్ష్మి వరించటంలేదా! అట్లాగే ఇంకోటీను. అదుగో వచ్చింది.

సం : ఏమిటో ఆలోచిస్తున్నారు.

నా : నా భాగధేయాన్నిగురించి.
చం : దానికేమి? ధనవంతులు. మంచివారు. గౌరవం కావలసినంతవుంది. ఇంకేంకావాలి?
నా : ఏమీ అక్కరలేదు. మనస్సు కష్టంగావుంది.
చం : ఉక్కపోస్తోందేమో. విసరనా (పైటతో విసరును)
నా : నీ చేతులు నొప్పిపుడతై. ఊరుకో!
చం : రెండుగంటలైంది; ఫలహారం తెస్తా! [నిష్క్రమణ]
నా : ఏమిటిది! మెస్మరైజు చేశాడా! మనిషి ఇంత సహజంగా వుంటుందా! నిజమో అబద్ధమోకాని భార్యతో సుఖమనుభవిస్తున్నట్లుంది. కొద్దిలోనే ఆయెను.
చం : (ఫలహారంతోవచ్చి) ఇంట్లో ఎవ్వరూ లేరేమి!
నా : మనం ఇద్దరమే వుండాలని.

[ఫలహారంచేస్తూ]

చం : నామీద అంతప్రేమ యెందుకు?
నా : భార్యని ప్రేమించటం తప్పా?
చం : నా అదృష్టం నాకు తెలియలేకపోలేదు. మూతికంటుకుంది. [చేతితో తుడుచును.] తామలపాకులుతెస్తా. [నిష్క్రమణ]
నా : నాకు కవిత్వమూరాదు, సంగీతమూరాదు. అందుకు సంతోషిస్తున్నా. వసుధ ఏమన్నది, సీతాదేవి రామచంద్రుణ్ణి తాకితే హరిచందనకుంకుమల అశ్చోత్యతనంలా వుందా! అవును. నిజమే. విషవిసర్పమూ, మదమూ అనుకొన్నాడట ఆయన. చంద్రంచేయి నాకు తాకిందా. తాకింది.

[కన్నీళ్ళు కార్చును.]

చం : (ప్రవేశించి)–(ఆదుర్దాతో) కన్నీళ్లు ఎందుకు. (దగ్గర కూర్చొని పైటతో తుడుచును.)

నా : ఇంత ఆనందం నేను భరించలేను.

[కన్నులు మూసుకొని పడిపోవును. చంద్రం అతని తల తొడమీద పెట్టుకొంటుంది )

నా : (కళ్ళు తెరిచి) నీవు నా చంద్రానివేనా?

చం : నేను మీ చంద్రాన్నే. తామలపాకులీనలు తీసి యివ్వనా?

నా : చంద్రం! చంద్రం!

చం : ఏమిటి చెప్పండి?

నా : నేనింక చచ్చిపోయినా ఫరవాలేదు.

చం : అశుభంగా మాట్లాడతారేమి?

నా : (లేచి) వీళ్ళందరూ ఎక్కడికెళ్ళారో?

చం : ఇప్పుడెవళ్లు కావాలి?

నా : కవి కావాలి. ఆయన వుంటే ఏదైనా పాట పాడతాడు.

చం : మీరు పాడమంటే నేను పాడగలను. కాని మీరు నా తొడమీద పడుకోరాదా! నా చేత అడిగించాలా? మీ ప్రేమంతా ఆత్మలోనే వుంటోంది.

నా : మనం సావట్లో వున్నాము; పాడు.

చం : చిన్నప్పుడు మా నాన్నగారు నాకు రుక్మిణీకళ్యాణం, గజేంద్రమోక్షణం, ప్రహ్లాదచరిత్రా అన్నీ చెప్పారు. రుక్మిణీ కళ్యాణంలోది చదువుతాను.

"ధన్యున్ లోక మనోభిరాము, కుల వి
ద్యారూప తారుణ్య సౌ

జన్యశ్రీ బలదాన శౌర్యకరుణా
సంశోభితున్ నిన్ను నే
కన్యల్ కోరరు, కోరదే మును రమా
కాంతాలలామంబు, రా
జన్యానేకపసింహా! నావలననే
జన్మించెనే మోహముల్."

నా : నన్ను మోసంచేసేందుకు ఏ చిన్నకాలువైనా చాలునే. భాగీరథీదేవి బయలుదేరి వచ్చిందెందుకో!

చం : నేను మోసంచేస్తున్నానా! శ్రీకృష్ణదేవునిమీద ఒట్టుపెట్టుకుంటున్నా. నేను త్రికరణశుద్ధిగా మిమ్మల్నే నమ్మి ఉన్నా! కావలిస్తే నన్ను పరీక్షించుకోండి.

నా : ఎవరో వస్తున్నారు. నీవు మేడమీదికి పద!

[చంద్రం నిష్క్రమించును]

నా : ఈ కృతకసౌఖ్యం అనుభవించనా! వద్దా! వసుంధరా! వసుంధరా!

[తెర]

# తల్లి లేని పిల్ల

## అష్టమాంకము

[వసుధయిల్లు. బుచ్చిమామ—వసుధ—భగీరథ శాస్త్రి—కళింగరావు]

బుచ్చి: బాగానేవుంది. ఎవళ్ళూ మాట్లాడకపోతే ఏమిటి లాభం? పదినిమిషాలనుంచి ఒకటేమౌనమా!

వసు: ఏమనమంటావు మామయ్యా! ఎవరయినా వస్తారేమో నీవు పోయి మాట్లాడిరా!

బుచ్చి: అమ్మాయీ! నిన్నమొన్న నా పడ్డపాట్లు భగవంతుడికి తెలును. ఊళ్ళో అందరూ కట్టుకట్టారు. అప్పటికీ చుట్టుపట్ల నాలుగైదూళ్ళకి అబ్బాయిని పంపించాను. ఎవళ్ళూ ఒప్పుకోలేదట. ఏంచెయ్యను?

కళిం: ఎవళ్ళూ రాకపోతే నాయుడుగారింట్లో వున్నారు. రాధాకృష్ణగారని కవి, మెస్మరిస్టూ, ఆయనాను. పీళ్ళిద్దరినీ పెడతాను. వాళ్ల మాత్రం బ్రాహ్మలుకారా?

బుచ్చి: నువ్వు పెట్టేటప్పుడు వాళ్ళిద్దరూ పనికివస్తారు.

కళి: మీ రందరూ అంతకన్న ఏ ఘెక్కువ? కవిగారు చక్కగా చదువుకొన్నాడు. సంగంగారు మంచి యోగి. మీ అందరి బ్రాహ్మలకన్న లక్షరెట్లు నయం.

బుచ్చి: సరే! పెట్టండి. నేను మాత్రం రాను.

వ: మరెవ్వరూ రాకపోతే తద్దినం ఏమి కావాలి మామయ్యా!

బుచ్చి: మీరు బ్రాహ్మణ్యంలో వుండాలంటే ఒక్కటే మార్గం.

ఆ పిల్లని ఇవ్వాళ ఊరు పంపించేసెయ్యాలి. కళింగాయికి రేపు ప్రాయశ్చిత్తం చేయించాలి. ఇహ వీడు సరిగ్గా వుండాలి. అప్పుడుకాని వ్యవహారం కుదరదు.

కళి : నే నా పిల్లని పెళ్ళిచేసుకుంటాను. మీరెవ్వరూ నన్ను పోషించటంలేదు. నా చదువుకి డబ్బుకూడా నాయుడుగారే యిస్తున్నారు. తక్కిన మూడునెల్లకి ఆయన్ని నేనే అడుగుతుంటున్నాను. నేను వెళ్ళిపోతాను.

వ : తండ్రి తద్దినం పెట్టవ్రుటా. కనీసం రేపు ఆబ్దికమన్నా జరగనీయి. తరువాత నీ యిష్టం.

భ : తరవాతవచ్చే అన్ని ఆబ్దికాలు చెడిపోయేటప్పుడు రేపటిది వాడి తండ్రికి మోక్షంయిస్తుందా?

బుచ్చి: ఆయన చూడు. మధ్యవర్తిలాగే మాట్లాడుతాడు. అసలు ఆయనకాదూ ఇదంతా చేసింది.

వ : నాయనా! నిన్ను బతిమాలుతున్నాను. తరువాత నీ యిష్టం వచ్చినట్లు చేద్దువుగాని. రేపటికి మాత్రం బుచ్చిమామ చెప్పినట్లు పోనియ్యి నాయనా!

కళి : ఈ ప్రాయశ్చిత్తం గీయశ్చిత్తం నే నొప్పుకోను. దీనికి నా కర్మమేమికాలింది.

భగీ : మళ్ళీ కర్మమంటావేమి? కర్మము, ప్రారబ్ధము మొదలయినవన్నీ వదిలితేనే యిల్లాంటి బుద్ధులు.

కళిం : మీరందరూ మోక్షానికి వెళ్ళండి. నేను నరకానికి పోతా. ఈ కర్మల్లో నాకు నమ్మకంలేదు. నేను పెట్టను.

బుచ్చి: ప్రతి వెధవకీ నమ్మకమే. నీ తాహతెంత, నీకు నమ్మక ముండేందుకు. అబ్బో! మహాపండితుడు బయలుదేరాడు. వెధవ నాలుగింగ్లీషుముక్కలు వచ్చేటప్పటికి ధర్మశాస్త్ర వేత్త అయినాడు. వీడు! వీడి కొాక నమ్మకం! నమ్మకంట! నమ్మకం! వెధవ! నాలుగు లాగితే గూబకొారికి తెలుస్తుంది.

కళి : ఇదిగోనయ్యో! మాటలు సరిగా రానియ్య. పెద్దవాడవని చూస్తోంటే ..

బుచ్చి: ఎందుకు? పెద్దవాణ్ణి అని చూట్టం ఎందుకు. ఏమిటిపెద్ద. నీకు తండ్రియే పెద్దలేదు. పెద్దవాళ్ళనివుంటే వాళ్ళమాట విను. తద్దినం ఎగకొాట్టేందుకు పెద్దలేదూ! దేనికిపెద్ద. తిరిగి తిట్టటానికి పెద్దా! ఎందుకు ఈ పెద్దరకం? మన్యాదా? ఈ మర్యాద ఈ ఇంగ్లీషు చదివిన వారికి మహా లావు.

ధ : ఒరేయి కళింగం, ఇటుచూడు. నీవు మాట్లాడితే రీజన్ రీజనంటావుకదా! ఇందులో రీజనుందేమో చూడు, నీవు పెద్దవాడవన్నావు. పెద్దవాడుకనక ఏమీ అనకూడ దని యెక్కడుంది. ఆచారమేనా! అదేదన్నా నీవు చెప్పే కామనుసెన్సా! అలాంటిదే అనుకో, చచ్చినవాళ్ళకి తద్ది నంపెట్టటం, రెండూ ఒకటేగా చూడు.

బుచ్చి: ఆ చూట్టం తెలిస్తే ఇల్లా ఎందుకు వుంటాడు?

కళిం : నేను తద్దినం పెట్టననటంలేదు. బ్రాహ్మలు రాకపోతే నేనేంచేస్తాను.

బుచ్చి: అత్తనోట్లో దిద్దకొట్టి, 'అత్తా! నీకేంకావా'లని అడిగిందట, నీబోటికోడలు. వాళ్ళు రాకండా చేసింది నువ్వేగా. ఎవతెనో మాలదాన్ని తెచ్చి దాన్ని పెళ్ళాడతానంటే ఎవడువస్తాడు నీ యింటికి.

కళిం : రాకపోతే మరీనయం

బుచ్చి: నీవంటి వెధవలు ఇంకేమంటారు.

కళిం : వెధవలంటే మళ్ళీ వెధవలంటారు.

వసు : ఒరేయి! నీకు బుద్ధిలేదురా! నోరుముయ్యి! పెద్దవాడాయనంటే మళ్ళీ అంటావురా!

బుచ్చి: ఒరేయి! చెపుతున్నా! ఇంక మీ అమ్మ, తాతయ్యాని చూసి వూరుకొనేదిలేదు. నీ ఆటలు నీ మెడ్రాసు పోయి ఆడు. ఇక్కడ ఆడావంటే ఎముకలు విరుగుతవి, జాగ్రత్త. ఎవరనుకొన్నావు.

కళిం : నీవు ఎవరనుకొన్నావు అంటే మళ్లీ అనేదే.

భగి : ఎముకల్ని విరిగించుకొనేదే!

వసుం: ఒరేయి! ఆయన తలుచుకుంటే నీ వెంతరా? నోరు మూసుకు ఊరుకో! చాలులే మామయ్యా! కుర్రకుంకతో ఏమిటి? వీడు నోరుమూనుకొని ఊరుకోడాయె.

బుచ్చి: మీ యిష్టమమ్మా! నేను వెళ్ళిపోతున్నాను.

[బయలుదేరును]

వసుం. మామయ్యా! ఏదో ఒకటి చెప్పిపో!

బుచ్చి: నిజంగా చెప్పమంటావా! చెపుతున్నా విను. ఆవు చేలో మేస్తోంటే దూడ గట్టున మేస్తుందా? నీవు తలవెంట్రు

కలు తీయించవు. చీరలు వాలుజడలు వేస్తావు. ఆమహా తల్లికడుపునపుట్టావు. నిన్నేమీ అనలేను కాని, లోకము లక్షవిధాల చెప్పుకుంటోంది. అంటే దానితప్పా లేదు. నీవూ నీ తండ్రీ కలిసి యీ పుసుక్షొ యింత వరకు తెచ్చారు. రేపు నీతల వెంకీకలు తీయించుకొని నీ మార్గం నీవు మానితే, ఆయనగారు ప్రాయశ్చిత్తం చేయించుకుంటే రేపు తద్దినం. లేకపోతే ఆయన చెప్పా డుగా. వారిద్దరిని భోక్తలకి పిలిచేది; పెట్టేది, ఇల్లాంటి తద్దినాలు లోకంలో చాలా జరుగుతున్నవి ఇక్క డింకా వుంటే మీ వాడిచేత తన్నులు కూడా తినాలేమో! ఇంకెందుకులే. [నిష్క్రమించును]

వ : నాయనా! కొంపమీద కెంత తెచ్చావురా!

కళిం : నేనేకాదు. నీవూ తెచ్చావంటున్నాడు. ఆయన ఎట్లాంటి వాడనుకొంటున్నావు.అసలు సంగతి విన్నావా! కడుపులో కుళ్లదీ అసలు.

వ : ఆయితే నేను తలవెంకీకలు తీయించుకుంటాను. నీవు ప్రాయశ్చిత్తం చేయించుకొంటావా?

కళిం : నీవు తలవెంకీకలు తీయించుకున్నా సరె. ప్రాణాలు తీయిం చుకున్నా సరే. నేను వెళ్ళిపోతున్నాను. ఇవ్వాళరాత్రికే మెడ్రాసు బయలుదేరుతాను. నాతో తిప్పలు మీ కెందుకు.

[పోబోవును]

వ : నాయనా! నన్ను వదలి పోతావా! తల్లికన్న యెక్కువరా ఆ పిల్ల నీకు. నిన్ను చేతుల్లో యెత్తుకు పెంచానే! నాయ

నా! నీకు సర్వచాకిరీచేశానే. ప్రాణాలన్నీ నీ మీద పెట్టు కున్నానే! నీవేమో నాతల పుళ్ళు కడిగి రక్షిస్తావనుకు న్నానే. ఎవత్తెనో చూసి దాని కోసమా యిదంతా!

కళిం : అది ఎవత్తోనా! అది నా ప్రాణం. ప్రేమ అన్నిటికన్న గొప్పది. ప్రేమకి ఇంకో భావానికి ఏమిటి సంబంధం. తల్లికన్న, తండ్రికన్న, లోకంకన్న ప్రేమ ఎక్కువ.

[పోబోవును]

వసుధ: నాయనా! పోకురా! ప్రేమ యేస్త్రీతోపడితే ఆ స్త్రీతో కలుగుతుంది. లోకంలో ఎవరినో ఒకరిని కలవటం కలు గుతుంది. ఆ సందర్భం పరిచయంగా మారవచ్చు. ఆ పరిచయం వృద్ధిఅయితే ప్రేమ అంటాము. పైగా ఆ ప్రేమలో శరీరసౌఖ్యం, శరీరాభిమానం ఎంతవుంది. ఆ స్త్రీకాకపోతే యింకోస్త్రీ అయినా ఆ ప్రేమ కలుగుతుంది. అది దైవికంకాదు. ఒకవేళ దైవికమయినా తల్లీ తం డ్రుల సంబంధమంత దైవికంకాదు. పొరపాటుపడుతు న్నావు దుష్టసిద్ధాంతాలల్లోపడి చెడిపోతున్నావు.

కళిం : ప్రేమముందర ఇంకోటి నిలవదు. నేను నీ కడుపున కాకపోతే యింకొకరి కడుపున పుట్టేవాణ్ణి. మాతాపుత్ర సంబంధం శరీరానికి సంబంధించినది. భార్యాభర్తృసంబం ధం ఆత్మకి సంబంధించింది. (పోబోవును)

వసు : ఋషులకు. కామక్రోధాలు చంపుకొన్నవాళ్ళకి, శరీరసం బంధం వదుల్చుకొన్నవాళ్ళకీ ఆత్మసంబంధం ఎక్కువది. అటువంటి ఆత్మజ్ఞానంవుంటే శరీరంలేదు. ఆత్మని ఈ

శరీరమే క్రిందికి లాగుతోంది. ఈశరీరంతో వున్నాన్నాళ్ళు శరీరమే బలవత్తరమైంది. ఆత్మని వెదకటానికి పోతూ శరీరసంబంధాలు కోసేస్తే న్యాయమేకాని, రెండు శరీర సంబంధాలల్లో అధమమైనదాన్ని అధికమైనదానికన్న గొప్పదని దుర్వ్యాఖ్యానం చెయ్యటం న్యాయంకాదు. నాయనా! పోకురా! తండ్రీ! పోకు!

కళిం : ప్రేమ శరీరాన్ని దాటిందని మహర్షులు చెప్పినమాట! ఆ ప్రేమముందు తల్లితండ్రులు లెక్కలేదు. నేను ప్రేమిస్తున్నది రాజ్యంలోని ఆత్మనుకాని రాజ్యంశరీరాన్ని కాదు. నేను మహావిషయాన్నే గ్రహించాను.

[వెళ్ళిపోతున్నాడు]

వసు: రాజ్యం శరీరాన్నికాదు నీవు ప్రేమించేది. సరే! ఆవిణ్ణి పంపించేశెయ్యి. ఆవిడ ఆత్మని ఇక్కడనుంచే ప్రేమించు. ఒక్క ఆవిడ ఆత్మనేమి? సర్వాత్మలను ప్రేమించు: శరీరం కాదుగా నీ ప్రేమకి స్థానం. నాయనా! పొరపాటు పడుతున్నావు. నీవు ఆమె శరీరాన్నే ప్రేమిస్తున్నావు. నాయనా, నీ ప్రేమ సౌఖ్యాన్ని వాంఛిస్తోంది. ఆ సౌఖ్యం శరీరసౌఖ్యం, మానసికసౌఖ్యం. ఆత్మని ప్రేమించడానికి ఈ రెండు సౌఖ్యాలు అక్కరలేదు.

కళిం: అవును. నేను దానికోసమే పోతున్నాను.

వసు : అది యితరత్ర యింతకన్న బాగా లభిస్తుంది.

కళిం: ఇంత చదువుకున్నది, అల్లాంటి సంస్కారంకలది దొర

కదు. అంత పరిపక్వమైన హృదయంకల మనిషి దొర కదు. రాజ్యమంటే మనోరాజ్యం.

వసు : సంస్కారం పుస్తకాలు చదివితేనే రాఅక్కరలేదు. సాంప్రదాయంలో పెరగటంకూడా చదువే. అసలు నెత్తురులో చదువుంటుంది. ఒక యింటపుట్టిన పిల్లకి ఒక చదువు, ఒక గుణము తెలుస్తుంది. దాని ఆచారాలు వేరు. నీవెంత చెడ్డా మాంసంతినవు. దానికి బజారునుంచి మాంసము తెచ్చిపెట్టలేకన్నా ఇబ్బందిపడతావు. ఒకవేళ అదీ యిష్టమయితే నీవు నా కడుపున పుట్టావు. దానికున్నంత కామం నీకుండదు. నీ నెత్తురులో లేదు, రక్తం? రక్తంలో ఎంతవుంది? నీ మనస్సు నీ నెత్తురునుబట్టి వుంది. నీ చదువు, నీ సంస్కారం, నీ యిష్టానిష్టాలు అంతా నీ శరీరంలోని రక్తముయొక్క ప్రత్యేక గుణాన్నిబట్టి వున్నయి. అయ్యో! నీ తెలివితేటలు మలచినవాడెవ్వడురా! వాడిసిద్ధాంతాలు కాలిపోను.

కళిం : నీ సిద్ధాంతాలకన్న వాడి సిద్ధాంతాలు ఎన్నోరెట్లు మంచివి. నీ వాడదానవు. ఇంట్లోకూర్చుని వంటచేసేదానవు. వాడు రాజ్యం చేస్తున్నాడు. నీకు మల్లే గాజులు తొడిగించుకు కూర్చోలేదు.

వ గాజులు బ్రద్దలు కొట్టించుకోవలసిన సమయంలో తొడిగించుకున్నాను. తప్పే.

కళిం : అందుచేతనే నోరుమూసుకు కూర్చో. నేను వెళ్లుతున్నాను. [పోబోవును]

వ : నీ కింగ్లీషు చెప్పిస్తే ఉద్యోగం చేస్తావనుకున్నాను- మూల చ్ఛేదం చేస్తావనుకోలేదు.

కళిం : మరి పెద్ద తెలివికలదానివలే మాట్లాడుతున్నావే. ఈ మాత్రం తెలియలేదా!

వ : తెలియలేదు. మీ నాయన చచ్చిపోవటంతోనే నా తెలివి పోయింది.

కళిం : అనుభవించు అయితే.

వ : అనుభవిస్తున్నా.

కళిం : అయితే వెళుతున్నా. [పోబోవును]

వ : తండ్రీ! వెళ్ళకురా! వెళ్ళకు. నా గొంతు నిన్ను పిలిచి పిలచి బొంగురుపోతోంది.

కళిం : ప్రేమ బలవత్తరంగా వుంది. వెళ్ళిపోతున్నా.

[నిష్క్రమించును]

వ : ఓరీ! వెళ్ళావా! వెళ్లావా! ఆహా! ఏమి, కొడుకు. ఛీ! ఛీ! నీకు సుఖం లేకుండా పోతుంది పో! ఇది తల్లిపెట్టిన శాపం అనుకో! నేను చచ్చిపోతా. ఇంకా బ్రతికియేందుకు. [మూర్ఛ]

భ : అమ్మా! కర్మ! పురాకృతకర్మ! లే.

[తెర]



# తల్లిలేని పిల్ల
## నవమాంకము



[నాయుడు యింట్లో సావడి. నాయుడు—కళింగం ఒకచోట; రెనడే-సంగం ఒకచోట; రాధ—రాజ్యం ఒకచోట.]

కళిం : నేను యిల్లు వదిలిపెట్టాను. మీరు లక్షచెప్పండి. నేనుపోను. నా యీ చదువు పూర్తిఅయ్యేదాకా మీరు సహాయం చెయ్యండి! ఇది మీకు తప్పదు. చేస్తారో చెయ్యరో చెప్పండి.

నా : చేస్తానుగాని తల్లిమీద తిరగబడటం న్యాయంకాదు.

కళిం : ప్రేమ యెక్కువా, ఈ యిల్లు యెక్కువా? మీరుకూడా చెప్పండి, మీరు ప్రేమకు అగ్రస్థానం యిస్తున్నారా, ఇవ్వటం లేదా?

నా : ప్రేమ అన్నిటికన్న గొప్పది. కాని యీ మధ్య నాఅభిప్రాయం కొంచెం మారింది. ప్రేమకన్న యెక్కువైనవి యింకా వున్నయల్లేవుంది. శరీరసౌఖ్యంకోసం ప్రేమ అని ధర్మాన్ని ఎందుకు పాడు చెయ్యాలి? ధర్మం ఎక్కువా, ప్రేమ యెక్కువా?

కళిం : ప్రేమయే ధర్మం; ప్రేమకన్న ధర్మం లేదు.

నా : ప్రేమస్త్రీ పురుషుల మధ్యగల ప్రేమ మాత్రమే ప్రేమా? తండ్రికొడుకులమధ్య ప్రేమలేదా? సర్వభూతముల మధ్య

ప్రేమలేదా? స్త్రీ పురుషుల మధ్య కలది ప్రేమ కాదు, కామము.

కళిం : మీరనుకొన్నట్లు నే ననుకోటంలేదు.

నా : పూర్వం నేనూ అనుకోలేదు.

కళిం : మీరు మునుపటికన్న బాగా ఊహించారని నమ్మకం ఏమిటి? నిజమైన దాన్ని వదలి అబద్ధమైనదానిమీదకే తిరుగుతోందేమో మీ మనస్సు.

నా : అంతా అనుమానం. పూర్వమే అజ్ఞానంలో వుండి యిప్పుడే జ్ఞానంలో వున్నానేమో? ఈ సిద్ధాంతాలు యిష్టానిష్టాల మీద వుంటయి.

కళిం : డబ్బుమాట ఏంచెప్పారు?

నా : ఇప్పు డెంత కావాలి.

కళిం : ఒక వందరూపాయలు. ఇవికాక ఇంకా రెండువందలు పంపిస్తే చాలు. తరువాత నా బ్రతుకు నేను బ్రతుకుతాను.

నా : ఇవి నేనిస్తే మీ అమ్మగారికి కోపంవస్తుందేమో.

కళిం : అయితే యీ వందమాత్రమే యివ్వండి.

నా : సరే. మూడువందలు ఇస్తాను.

సం : కళింగం రాజ్యాన్ని తీసుకువెళ్ళిపోతాట్ట.

రెన : మీరు నాయుడుగారింట్లో నయంచేశారా?

సం : ఆ! నేను రేపో ఎల్లుండో వెళ్ళిపోతాను.

రెన : అబ్బో! మీరు అసాధ్యులు.

సం : ఏం చేశాను?

రెన : మీకు తెలియదా? ఎవళ్ళమనస్సు వాళ్ళకే సాక్షి.

సం : చెప్పు.

రెస : నే నొక్కణ్ణే అన్నానా ఏమిటి? ఊరంతా అంటున్నారు.

సం : ఎవళ్ళపాపాన వాళ్ళేపోతారు. చెపితే సమాధానం చెపుతా. దాస్తే ఒట్టు.

రెస : మీకూ, నాయుడుగారి భార్యకూ—

సం : సీతాదేవినిగురించి అంటే రాములవారి దగ్గర సాగినట్లు చంద్రమతీదేవిగారిని గురించి అంటే నాయుడుగారివద్ద సాగదు. ఆవిడ చాలా పతివ్రత, భగవంతుడిమీద ఒట్టేసుకొని చెపుతున్నాను. నీవు తెలివితక్కువవాడివి. మంచివాడివికనక చెపుతున్నాను. ఆవిడని మొదట నేను కొంచెం చెడ్డమార్గంలోకి త్రిప్పుదామని చూశాను: అట్లా ఇదివరకు చాలామందిని చేశాను. ఆపాపం వేరు. ఈవిడ చాలా మంచిది. ఆవిడను గురించి ఏమన్నా అంటే పుట్టగతులుకూడా వుండవు. ఆవిడా మంచిది. నాయుడుగారూ దేవుడువంటివాడు. వా రిద్దరూ సుఖంగా బ్రతకటం లోకానికి కళ్యాణం.

రె : నాయుడుగారికి నమస్కారంచేసినా తప్పులేదు. అయితే రేపు మీరు వెళతారన్నమాటే.

సం : నాయుడుగా రుండమంటున్నారు. కాని నాకూ పనులున్నవి; వెళతాను.

రె : ఒక సహాయంచేసి పెడతారా?

సం : చెప్పు.

రె : ఈ రాజ్యాన్ని నేను మద్రాసులో యెరుగుదును. అక్కడ నేను వేషాలు వేసినపుడు ఈవిడ వచ్చింది. నన్ను చాలా మెచ్చుకుంది. తరువాత కొంత గ్రంథం నడిపాను, గాని చివరకు ఆవిడ తిరస్కరించింది.

సం : అందరికీ అంతేనా! నాకూ అంతే. ఆ అమ్మాయి పైకి అల్లావున్నా లోపల కళింగాన్నే ప్రేమిస్తోంది. పాపం అతను చూడు. ఆవిడ కోసం ఎంత వదిలిపెడుతున్నాడో. ఆవిడను పాడుచెయ్యటానికి ప్రయత్నం చెయ్యటంకూడా తప్పు. సరే. నువ్వు ఎప్పుడు వెళ్ళిపోతావు.

రె : నేనూ రేపే వెళతాను. మా మామయ్యనిచూచి పోదామని వచ్చాను. పనేముంది.

సం : ఏదీ! వెళ్లేలోపుగా ఆ కీర్తనా పద్యం అని పో!

రె : పోవయ్యా! నీ అల్లరి.

* * *

రా : నన్ను ప్రేమిస్తున్నావా! లేదా!

రాజ్య: ప్రేమిస్తున్నాను.

రా : అయితే కళింగంవెంట వెళ్ళిపోతానంటావేమి?

రాజ్య: కళింగం నా రాజు. నేను అతని రాజ్యాన్ని. నిన్ను ప్రేమించటం ఊరికే ప్రేమకోసం.

రా : నిన్ను నేను పెళ్ళాడతాను. ఒప్పుకుంటావా?

రాజ్య: నీది Free love గాదూ! పెళ్ళి ఎట్లా ఆడతావు.

రా : నీ కోసం ఆడతాను నీ వంటి రత్నం దొరుకుతూంటే

ఒక సిద్ధాంతం కొక్క ఏమిటో దాన్ని త్యజిస్తాను.

రాజ్య: ఒకవ్యక్తికోసం ఒక సిద్ధాంతం త్యజించే వాళ్ళని నేను త్యజిస్తాను.

రా : అయితే కళింగం అదే చేస్తున్నాడు. నీ కోసం తల్లినీ, కుటుంబాన్నీ వదిలి పెడుతున్నాడు.

రాజ్య: అతనికి ఆ సిద్ధాంతంలో నమ్మకం లేదు.

రా : నాకూ Free love లో నమ్మకం లేదు.

రాజ్య: ఛీ! ఛీ! నోరుముయ్యి.

రా : నోరుమూస్తే చెయ్యి ముద్దుపెట్టుకుందామనా.

రాజ్య: నిలకడలేని చెయ్యి ముద్దుపెట్టుకొని ఏమి లాభం.

రా : నీవూ పాతసరుకే? పో!

కళిం : రాజ్యం?

రాజ్య : వెళదమా?

కళిం : స్నేహితులతో మాట్లాడుతున్నావల్లే వుందే.

రాజ్య: నా రాజు పిలుస్తోంటే స్నేహితులడ్డ మొస్తారా!

కళిం : బయలుదేరు.

రాజ్య: (గంతువేసి) రెడీ!

నా : నేను వాళ్ళని పంపించి వస్తా.

[నాయుడు, రాజ్యం, కళింగం తక్కిన ముగ్గురికి షేక్ హాండ్లు ఇచ్చి నిష్క్రమింతురు.]

సం : కవిగారి కేమన్నా లాభం కలిగిందా?

రాధ : ఎక్కడన్నా బావ అనుగాని వంగతోటదగ్గర కాదన్నట్లు

సం : వినవయ్యా! రెనడే! ఏదీ 'మీరజాలగలడా' పాడు.

రెన : నాకు రాదు.

సం : పాడకపోతే ఎరుగుదువుగా.

రెన : ఓహో! పో! నీతో గోల. [పాడును.]

సం : ఆహా! తెలుగుదేశమంతా మారుమోగిపోతోంది.

రెన : ఇందుకునేనా పాడమంది.

సం : నీపేరెట్టి అన్నానా?

రెన : అయితే ప్రొఫెసరుగారూ! వాగుండలేవా!

సం : నే నంటే ఆగుతుందా! నిన్ను దేశదేశాలా మెచ్చుతోంటే, నేను కోసిక్కిస్కాగాణ్ణి అని ఏంలాభం.

రాధ : బుద్ధిమంతులు ఎవరూ మెచ్చుకోటంలేదు. వాళ్ళ సంఖ్య తక్కువేగాదూ లోకంలో.

రెన : పూర్వం ఇట్లా అంటే వూరుకొనేవాణ్ణి కాదుగాని యిపుడు మీరన్నమాటలే నిజమా అనిపిస్తోంది.

సం : ఒకడవన్నా బాగుపడ్డావు.

నా : [ప్రవేశించి] ఏదో కాలక్షేపం చేస్తున్నారు.

రాధ : ఏమాత్రం వదిలింది.

రెన : అలవాటేగా?

వసు : (ప్రవేశించి నిలుచుండును.)

నా : అయన్ని తిప్పటం మహాకష్టమైంది. నా శాయశక్తులా ప్రయత్నించాను. అట్లాటివాణ్ని ఇబ్బందిపెట్టటం ఎందుకని డబ్బిచ్చి పంపించాను. మిమ్మల్ని వదలిపెట్టినా మీ

కుమారుడన్నమాట మరచిపోలేక యిచ్చాను.

వసు : ఎక్కడదో అక్కడ మీ పుణ్యమా అని బ్రతికివుంటే చాలు. ఇవ్వాళ మీరందరూ మాయింటికి భోజనానికి రావాలి. నాయుడుగారూ మీరు వారిముగ్గురిని తీసుకురావాలి.

రాధ : మే మందరం కలసి భోంచేస్తాం. మీ కిష్టమేనా?

వసు : అది నా కొడుకుకన్న ఎక్కువచెడిపోవటం కాదుకదా!

సం : కవీశ్వరుడు!

నా : అలాగేగాని, యెందుకు? సరే రెండి.

[తెర]

# తల్లిలేని పిల్ల
## దశమాంకము

[వసుధ యిల్లు—రాత్రి—వసుధ, భగీరథశాస్త్రి, రాధ, నాయుడు, సంగం]

వసు : రామనాథంగారు రాకపోవటమే లోపమండి.

రాధ : ఆయన రైలుకి వెళ్ళారు. మరేంచేస్తాం.

వసు : దయచెయ్యండి. తాంబూలం స్వీకరించండి.

సం : తాంబూలం వేసుకొనేందుకు ఖాళీలేదండి.

వసు : పేదవాళ్ళయింట్లో భోజనానికి అంత శ్లాఘ ఎందుకు.

సం : మీరు పేదవాళ్లేకావచ్చు. కాని భోజనం అల్లా లేదు.

నా : ఈ భోజనం ఎందుకు? ఈ విందు ఎందుకుఇచ్చినట్లో తెలియలేదు. కొడుకు పెళ్ళికా?

వసు : బాగా ఓదారుస్తున్నారు.

సం : బావగారికి బుద్ధి పరారిఅయింది.

వ : మీరు చేసిన పనేగా ఆయన్ని మన మాట వినకుండా చేశారు.

సం : ఆయన మేఘాలమీద ఎగురిపోతున్నాడు.

నా : వరసకాదు కాని, వీలుగా వుంది మీకు?

సం : నాకు రైలుటైము అవుతోంది. వెళతాను.

వ : ఇప్పుడే మిమ్మల్ని ఒకటి అడగాలని అనుకుంటున్నాను. అడగమంటారా!

సం : అడగండి.

వ : చచ్చిపోయిన తరువాత ఆత్మ ఏమవుతుంది? ఆ ఆత్మ పొందే మార్పు చచ్చిపోయే పద్ధతుల ననుసరించి వుంటుందా?

సం : మెస్మరిజం అంటే యోగంలో ఒక తక్కువ రకం సాధన. మెస్మరిజం చేసేవాడికి ఏమీ తెలియదు. ఈ జీవితం తరవాత సంగతులకి ఋషుల వాక్యాలే ప్రమాణం. ఒక్కొక్కడి మతం ఒక్కొక్క మోస్తరు వుంటుంది. ఋషులు తమ యోగ సమాధిలో వుండి వాళ్లు చూశారు, చెప్పారు. మనం వాళ్ళని అనుసరిస్తాం. ఇంతే. నా కెక్కువ తెలియదు. మీ నాయనగారుండగా వారికన్న మా కెక్కువ తెలుసునా?

వ : ఆత్మహత్య చేసుకొంటే నరకలోకానికి పోతారంటారు. నిజమా?

సం : చచ్చేటప్పుడు ఆత్మ ఘోరబాధ అనుభవిస్తుంది. కనుక పోనూ వచ్చు.

వ : యుద్ధంలో చస్తే స్వర్గానికి పోతాడంటారు. ఈ జీవయాత్ర యుద్ధం వంటిది. ఇందులో చస్తే ఎందుకు పోరాదు. కత్తితో చేస్తేనేనా యుద్ధం.

రా : ఇంగ్లీషులో జీవితాన్ని యుద్ధంతోనే పోలుస్తారు.

సం : మీ అబ్బాయి యిల్లా లేచిపోతే మీరు కదలకండా మెదలకండా వున్నారు. మీరు యుద్ధవీరులంటివారనే చెప్పవచ్చు.

వ : మనం చేసేదేముంది. కలి అల్లా విజృంభిస్తోంది.

వ : కళింగమంటే అంతే. కలి అంటే పాపం. 'కలింగచ్ఛతీతి కలింగః' అని, పాపమును పొందేవాడు కళింగుడు. వాడూ వాడి రాజ్యం కళింగరాజ్యం అయింది.

సం : బాగా అన్నావు బాబూ. సెలవు నాయుడుగారూ!

నా : [illegible]గారూ ఆనాలి!

సం : మీ దయ. సెలవు. అమ్మా సెలవు.

నా : నేను బావగారిని పంపించి వస్తా.

వ : మళ్ళీ రావటమెందుకు, కష్టాలన్నీ తీరిన హరిశ్చంద్ర మహారాజల్లే సుఖించక. [అందరు నవ్వుదురు]

నా : బావగారి దయవల్ల మళ్ళీ పెళ్ళికొడుకల్లే వున్నాను. మీ[illegible] [illegible] కష్టమేమీలేదు.

భ : ఇంత అమాయకుడవు కనుకనే దేవుడు నిన్ను దయ చూశాడు. బాబూ! సుఖపడు.

సం : పెద్దలు. మీ ఆశీర్వాదము.

[నాయుడు—సంగం నిష్క్ర.]

రా : నేనూ వెళతాను.

భ : ఇక్కడ పడుకోండి బాబూ ఈ రాత్రికి.

వ : నాయుడుగారిని ఏకాంతంగా వుండనీయండి. పాపం. ఎన్నాళ్ళకి ఆయనకాపురం కుదుట పడ్డది. ఆ యస్థితి చూస్తే ఇక నాకు సుఖంగా నిద్దరపడుతుంది.

రా : ఆయన కష్టం మీరేమనుభవించారు.

వ : మే మిద్దరమూ ఒకరికష్టాలొకరు అనుభవించాము,

రా : ఆయనకష్టాలు తీరినై. మీ రేం చేస్తారు. ఇంక మీ కష్టాలు ఎట్లా తీరుతవి.

వ : నా కష్టాలు తీరే యోగ్యత వుంటే మా కళింగ అల్లా ఎందుకవుతాడు. పోయి పడుకొంటాను.

[నిష్క్రమణ]

భ : బాబూ! పడుకోండి. [ఇద్దరూ పడుకొందురు]

భ : మీరు వ్రాసిన పద్యాలు ఏమన్నా చదువు తారా!

రాధ :
ఇంటిలోన సర్పము ప్రవేశించి భయము
కలుగఁజేయు చెల్లెడఁ దిరుగాడినట్లు
అల్లనల్లనఁ బడి తిరుగాడఁ జొచ్చె
నాదు మనసున నేదో విషాదరేఖ.
తొల్లినిజముగ నే నొక దుఃఖలోక
వాసుఁడను నా కచట నిల్లువాకిలియును
గలదు చిరుగొంతు మలచు చీకటులపాట
పాడిపోవంగ నిచటికి వచ్చినాను.

భ : బాబూ! ఎంతగొప్ప కవివి? ఇంకెవ్వయినా?

రాధ :
పలుగురాచిన నాగొంతు మలగి మలగి
రాగమెడలించె బీణనరాలు బిగిసి
పరమచరమార్ధగీతిక పలుకలేని
మెట్లు కిన్నెరతీగలు చిట్లిపోయె.
ఓ ప్రణయశీల నేను నిశా ప్రశాంత
గాఢతమసాకృతిని నీవు కలలొదిగిన

చటుల సౌదామనీరేఖ విటుల నాదు
దివ్య సన్నిధికే దారితీసినావు.

భగీ : బాగుంది. చక్కని ధార. ఒకానొక విచిత్రమైన మానసికస్థితిని చిత్రించావు. శబ్దాలుకూడా మధురంగానే కూర్చావు.

రాధ : ఇందులో బుచ్చిమామగారు తప్పులన్నారు. 'కలలొదిగిన' ఏమిటన్నారు?

భగీ : అది మన సాంప్రదాయంకాదు. దానికేమిలే. వస్తోంది.

[నిద్రించును]

రాధ : ఈయన కపుడే నిద్రపట్టింది. నాకా నిద్రపటుతుంది· వసుంధర నా మనస్సులో కూర్చుంటే నాకు నిద్ర యెలా పడుతుంది, పాపం. ఆవిడను కొడుకు పరిత్యజించాడు. నాయుడు పరిత్యజించాడు. నాయుడు ఇంకా ఈవిడవంక చూస్తాడా? లోకమంతా స్త్రీ ముఖంగా పోతోంది, Ibsen 'Lady of the sea.' అన్న గ్రంథంలో ఈ సంగతి ఎంతబాగా వ్రాశాడు. లోకంలో నేనొక దుఃఖమయజీవిని. ఈ వసుధ నాకన్న. నామనస్సావిడకేసి లాగుతోంది,

రాత్రి రెండుజాములు దాటింది. శాస్త్రిలుగారు సుఖంగా నిద్రపోతున్నాడు. ముసలివాడి కింత బాగా నిద్ర పటుతున్నందుకు చెప్పాలి. జీవితమంతా పరిశుద్ధంగా గడిపాడుకాబోలు. నిద్రపట్టక ఏంచేస్తుంది.

వసుధ నిద్రపోతోందా? ఆవిడకి యివ్వాళ నిద్ర పడు

తుందా? నాయుడు ఆనందవీథీవిహారం చేస్తున్నాడు కాబోలు. నా మనస్సు కఱ్ఱదెబ్బతిన్న పామల్లే మధ్యకు తునిగి అల్లల్లాడుతోంది.

తొల్లినిజముగ నేనొక దుఃఖలోక
వాసుడను నా కచట నిల్లు వాకిలియును
గలదు చిఱుగొంతు మలచు చీకటులపాట
పాడిపోవంగ నిచటికి వచ్చినాను.

వసుధను లేపి అడిగిచూస్తా. ఆవిడయిష్టమైతే నే నెందుకు పెళ్ళాడరాదు. ఆవిడ నాయుణ్ణితప్ప ఇంకెవ్వరినీ ఎరగదల్లేవుంది, నాయుడు ధనవంతుడు. నేను కాదు, నేను కవిని. నాయుడుకన్న అందగాణ్ని. అతనికన్న ఎక్కువ సంస్కారంకలవాణ్ని. ఆవిడకి నామీద ప్రేమ వుందల్లేవుందికూడాను. ఆమె మనస్సులో కామ ప్రవృత్తి చాలా వుంది. నాయుణ్ని గూర్చి ఎంతపంచికం ఆడింది. పోయి నిద్రలేపుతాను. (నడచి) చివరకి ఇది రసాభాసం అవుతుందేమో? ఆవిడకు నామీద ప్రేమవుందని ఎట్లా?

(పోయి పండుకొనును)

కాదు, పోయి అడుగుతా. మీదుమించివస్తే రైలుకు పట్టిద్దాం. ఛీ! ఛీ! ఇదేమి కర్మమోకాని నా మనస్సు కవితా విషయాల్లో ఎంత ఉత్తాలంగా పోతోందో తక్కినవిషయాల్లో అంత అధమంగా నడుస్తోంది, నాకు భయమేస్తోందేమిటి? పోయి చూస్తా! వసుధా! వసుధ.

[నిష్క్రమించి]

[మరల ప్రవేశించి][ఆవేశంతో] శాస్త్రిగారూ! శాస్త్రిగారూ!

భగి : (లేచి) ఏమిటి? నాయనా!

రాధ : పోయి మీ అమ్మాయిని చూడండి.

భగి : ఏమి? (వెళ్ళివచ్చి ఉత్తరంతో) నాయనా అనుకొన్నంతా అయింది. నీవు పోయి నాయుడుగారిని పిలుచుకువస్తావా!

(రాధ నిష్క్రమించును )

భ : (వుత్తరం చదువుతూ) తల్లీ! ఆత్మహత్య తప్పనిచెప్పానుకదమ్మా! ఎంతచక్కనివురిపోసుకున్నావు. (మూర్ఛ)

[నాయుడు, చంద్రమతి ప్రవేశింతురు]

నా : అయ్యో! చంద్రం! ఏమిటీ గతి?

చం : పడిపోతారేమో! నన్నానుకు నుంచోండి.

భ : (తెలిసి) నాయనా! చివరకు నాగతి యిల్లా వచ్చింది.

[నాయుడు, చంద్రమతి లోనికి పోదురు]

రా : (ప్రవేశించి) ఎంతచక్కని వురిపోసుకుంది. ఈ ప్రయత్నం ఈవిడ చాలా రోజులనుంచి చేస్తున్నట్లుంది.

[నాయుడు, చంద్రమతి ప్రవేశింతురు]

రా : పెట్టెమీద పెట్టె, పెట్టెమీద పెట్టా పెట్టింది. దానిమీద నుంచి వురిపోసుకుంది. సన్నని పగ్గం ఆముదంలో తడిపి అట్టిపెట్టింది.

చం : అది అయిదారు రోజులు నానితేగాని అల్లాకాదు.

రా : కాళ్ళకి తిరగలిరాళ్ళు కట్టుకుంది. సరిగ్గా చెరసాలల్లో ఇల్లాగే చేస్తారు.

చం : కళింగానికి టెలిగ్రాం యిస్తే.

రా : అతను రైలులో వుంటాడు. అయినా చంద్రికి తద్దినం పెట్టనివాడికి తల్లి చచ్చిందంటే లెక్కా!

చం : (నాయుడితో) ఏమిటి అల్లా వున్నారు.

భ : తల్లీ! ఆయన్ని జాగ్రత్తగా చూసుకో!

చం : (నాయుడి మొగంలో మొగంపెట్టి) నేను బ్రతికేవున్నా!

నా : (శ్వాసతీసికొని చంద్రాన్ని దగ్గరకు లాగుకొనును)

చం : నన్ను వదలిపెటతారా!

నా : నీ కోసమే బ్రతుకుతా!

చం : మీరు బ్రతుకుతానంటే నేను బ్రదికాను.

నా : క్రొత్తగా వచ్చిన లాభం ఇంకో నష్టాన్ని పరిగణించ నీయదు. [పోయి శాస్త్రిగారి కాళ్ళమీదపడి యేడ్చును.)

భగీ : నాయనా! జంతువులు స్వకర్మానురూపంగా వికారం పొందుతవి. దానికి దుఃఖించటం ఎందుకు.

నా : కళింగాన్ని రమ్మని టెలిగ్రాం కొడతా.

శాస్త్రి : నీ టెలిగ్రాం వాడికి రేపు చేరుతుంది. వాడు ఎల్లుండి వస్తాడు. తల్లిశవాన్ని ఎల్లాగూ చూడలేడు. పైగా వాడు వచ్చి కర్మచేసేదిలేదు. నే నున్నాగా. నేనే చేస్తాను.

నా : బాబూ! ఇంక మీరు బ్రతికే దెల్లాగా!

శాస్త్రి : నాయనా! మనమతం అందరికీ చక్కని ఏర్పాట్లుచేసిపెట్టింది. నాకు కూతురిమీద మమత లేకపోతే ఎప్పుడో సన్యసించాలిసింది. ఇపుడు చూడు నిర్విచారంగాచేస్తాను ఆపని. కర్మలుపన్నెండురోజులుఅయింతరవాత యీయిల్లు కళింగానికి. నీవు వాడికి యీ కొంచెమాస్తి అప్పగించు.

నా : మీకున్న ధైర్యంలో ఒక్కలేశం నాకు లేదు.

భ : బ్రతికి బట్టకట్టాలసినవాడవు నీవు. నేనొకకాలు ఇక్కడ, ఇంకో కాలక్కడ వున్నవాణ్ని.

రాధ : ఈ మహాంధకారమ్మున నేనొకండ
కర్కశకఠోర ఘూసంఘాతరావ
కుటిలముగ గొంతులెత్తిక కూయుచుంటి
ఈ విషాదకీచకసమావృతగుహాళి.
చిటపెట రగుల్చుకొనుచున్న చిత, మదీయ
జీర్ణదేహాస్థి పెటిలి యుద్దీర్ణరవము—
జ్వాలదనలజిహ్వాకొగ్రహాసమ్ము ననుస
రించి నాపూర్వగీత స్ఫురింపఁజేయు.

భగీ : హా! హా! మహాకవి!

నా : చంద్రం! నీ చేతులు నా మెడమీద వెయ్యి! (చంద్రం అట్లు చేయును.)

నా : నువ్వూ ఆవిడా అన్నసందేహం వున్నన్నాళ్లు ఇద్దరూ బాగానే వున్నారు. నీవని తేలిపోవటంతోటే ఆవిడ తన ఆగత్యం తీరిందనుకొని వెళ్ళిపోయింది. ధర్మమే జయిం చింది.

భగీ : ధర్మము జయించడమే వసుంధరా కళ్యాణం.

[ తెర ]

(ఓం తత్సత్)

